# ముందుమాట



ఆంధ్రదేశమున ప్రస్తుతము నవలలయందు నాదరణ మెండని పాఠకులకు గ్రాహ్యము. అందు అపరాధపరిశోధకనవలలనుజదువ్రుయందే ఉత్సాహమధికము. ఈ 'కొరడారాణి' అద్భుతఅపరాధపరిశోధక నవలారాజము—ఇందు వారణాసీనగరమున ప్రధాని రాజద్రోహియై రాజ్యంబును, కామోద్రేకుడై రాకుమారి నాశించి, అగ్నిసాక్షిగ పెండ్లాడిన భార్యను విడనాడి వేశ్యాలంపటుడై తుద కామెనుగూడ నిరసించి, హింసించి, రాజును రహస్యముగా నొకచోట బంధించెను. అద్భుతబలపరాక్రమోపేతుండును, మంత్రితనయుండును నగు రమేశదత్తుడుమంత్రికి పుత్రుడని తెలియకనె రాజోద్యోగియై. రాజభక్తితత్పరుడై యుద్యోగమువీడి 'కొరడారాణి' యనుపేర రాజద్రోహులనాశనము జేయసమకట్టిన పత్తేదారిణితోగూడి మంత్రియే రాజద్రోహియని తెలసికొని ప్రత్యక్షమున నాతని నెదిరించి తనపై వలపుగొన్న రాకుమారికి చివరవరకు తనప్రేమను తెలియజేయక ఆమె ననుక్షణము రక్షించుచు తుదకు మంత్రిని ఖండించి, రాజును రాజ్యంబునజేర్చి రాకుమారిని పెండ్లాడెను. తండ్రి హంతకుడు, కొడుకు రాజభక్తితత్పరుడు. భార్య పత్తేదారిణి. ఈ యీ అద్భుత ప్రకరణాంతర్గత కథాభాగముల జదివి తెలియగలరు.



# కో ర హా రా ణి.

## మొదటి ప్రకరణము.

———:0:———

రంగోత్తుంగతరంగసంకలితమై మహాపులపాపముల నెల్ల పటా
పంచలము గావించుచున్న గంగాస్రవంతీతీరమున నున్న వారణాసీనగర
వాసు లిరువురు తీరమున కూర్చుండి యేమియో ముచ్చటించుచుండిరి.
అయ్యది సాయంసమయము. పడమటికేత భానుండు తనసుపాలన చాలించి
పశ్చిమాద్రిం దిలదాచుకొన వేగిరించుచుండెను. అంతదనుక ధవళ
కాంతుల విరజిల్లుచు, సమితియుష్ణమును వెదజల్లుచున్న రవికిరణ
ములు శీతలము దాల్చి సున్నితచ్ఛాయలం దాల్చెను. ఆతటంబున నా
యిరువు రేగాక యింకను చాలమంది యువకులు సాయంతనపు చల్ల
గాలి నాస్వాదింప నేతెంచియుండిరి. వారు వివిధవేషధారులై వివిధ
సంభాషణంబుల నాతీరమునుండె ప్రవాహమునకానికం గట్టబడిన
చీడలపై కూరుండియుండిరి. యువతులు కలశంబుల గొని నది
కేతెంచి యచట శృంగారముల దిద్దుకొంచును, నీటనిముంచుకొనుటకో
గాలవిలంబన మొనరించువారు గొందరును, యిండ్లవద్దనున్న పనుల
తొందరచేతనో, లేక పురుషు దిలకింప నిచ్చ జనింపకుండుట చేతనో
తలలు వంచుకొనియే జలమును గ్రహించి వెడలిపోవువారు కొందరును,
నీవిధమునం బలుతెరంగుల స్త్రీపురుషులతో నిండియున్న యానదీతటం
బాసమయమున ప్రేక్షకుల కానందము గలిగించుచుండె ననుటకో
సందియము లేదు.

పాఠకులారా! మనకా పురుషు లందరితోడను నిమిత్తము లేదు. మనము తొలుత దిలకించిన పురుషులనుమాత్రమే బాగుగ పరికింప వలసియున్నది. అందొకడు వృద్ధుడు—కేవలము వృద్ధుడు గాడు. కేశపాశము లింకను నల్లబడ కున్నను, శరీరము ముడుతలు పడకున్నను, నరపటుత్వము తగ్గకున్నను అతని వయ సెబదిదాటి యుండునని చెప్పక తప్పదు. అతనిఫాలము విశాలమై యాతనిసూక్ష్మజ్ఞానమును, వెల్లడించుచున్నది. రెండవవాడు యువకుడు. పదునెనిమిదివత్సర ముల ప్రాయమువాడు. అతని ఫాలముకూడ విశాలమై యాతడు కూడ సూక్ష్మబుద్ధి గలవాడని చాటుచున్నది. వారిరువురునుగూడ సామాన్యదుస్తులను ధరించియుండిరి. వారు కొంతసేపు మౌనముతో కూర్చుండి తరువాత యిట్లు సంభాషింప సాగిరి.

యువ—తాతగారూ! ఇప్పటికి పదునైదు వత్సరములుండి మమ్మాదరించి యుంటిరి. ప్రాజ్ఞుడ నైనందులకు ఫలముగ నీ నాటికి రాజేంద్రునికొలువున మీయనుగ్రహంబున నుద్యోగము కూడ లభించినది. రేపటినుండి మాజననియు నేనును వేరు గృహమున నుండుట కనుజ్ఞ యొసంగెదరని నమ్ముచున్నాను.

వృద్ధు—వలదు నాయనా! నాయింటనే యొకభాగమున నుండుడు. ఒక భాగ మేల? నేను కటకపురములోని నాకుమార్తెకడ కరిగెదను. అందుచే మీరు వేరుగృహము చూచుకొన నవసరములేదు.

వారట్లు సంభాషించుకొనుచు సాయంకాలమున కింటికివచ్చిరి ఆయువకుని జనని వారిరాకకై నిరీక్షించుచుండి వారిల్లు చేరినంతనే కుమారునిం గాంచి, "రమేశం! రేపటినుండి నీకు వేతన మభివృద్ధి చేసిరట! ఇప్పుడే షరాబు వచ్చి చెప్పెను." అనెను. వారందరు ఆనందించిరి.

భోజనానంతరము మావృద్ధుడు రమేశదత్తునితో కూడ దెలిపి, వారణాసి కిరువది మైళ్ళదూరముననున్న కటకపురము పయనమయ్యెను. మరునాడు కటకపురమున సంత యగుటచే నారాత్రి యచటనుండి చాలమంది వర్తకులు వెడలుచుండిరి. వారందరితో గలసి యా వృద్ధుండుకూడ తనసామాగ్రియింటికి వెడలెను.

రమేశదత్తుగృహమునకు సమీపముననే యానగరాధీశుని భవనము గలదు. రాత్రి రెండుగంటలు దాటునప్పటికా భవనమునుండి పెద్దకోలాహలము బయలుదేరినది. భవనసమీపముననే వసించుచున్న రాజకీయోద్యోగులందరును భవనముచుట్టును చేరిరి. లోని కేగుటకు ద్వారములన్నియు బంధింపఁబడియున్నవి. బయటజరుగుచున్న కోలాహలము విని లోపలనున్నవారు తలుపులు తెరచి, "రాజకీయోద్యోగులారా! పౌరులారా! మీప్రభుభక్తి వెల్లడించుట కిదియే సమయము—మీప్రభువును హరించి తెచ్చినాని పోయిరి. ఇదిగో యుత్తరము" అని పలుకుచు నొకయుత్తరమును నాగుంపునందున్న యమాత్యున కొసంగెను.

మంత్రియు నాయుత్తరమును దిలకించి యిట్లు చదువసాగెను.

"రాజాశ్రితులారా! మీప్రభు విప్పుడు నాయధీనుఁ డయ్యెను. నే నాతనిఁ గొండొకయాశయముతో బంధించితి. పరిపాలనాకార్యమంతయు నింకటినుండి నేనే వహించెదను. ఏనాటి కానాడే, రాజకీయోద్యోగులందరును గావింపవలసినకృత్యములన్నియు తెలియఁజేయుచుందును. నాయాజ్ఞలకు వ్యతిరేకించిన వారలకు శిరచ్ఛేదము తప్పదు. హెచ్చరిక.'

ఆయుత్తరమును చదివిన యమాత్యుఁడును, వినిన పౌరులును గూడ నత్యాశ్చర్య మందిరి. 'ఘోరము!—ఘోరము!' అని యందరును యెలుగెత్తి యరువసాగిరి. మంత్రి యాసందడి నంతయు

వారించి "రాకుమారీ! ఇందు నీయభిప్రాయమేమి? తస్కరుని యాశయ మేమై యుండును?" అని ప్రశ్నించెను.

"అమాత్యశేఖరా! నే నేమి చెప్పగలను? మీరే కర్తవ్య నిర్ధారణ గావింపుడు. నాజనకుని హింసించిన యాదుర్మార్గుడు మన యెడ దయారసములు చూపునా? ఎటులయిన నాతుచ్ఛుని బంధించు టయే శ్రేయస్కర మని తలంచెదను."

"నేనును నదియే తలంచుచుంటిని. ఓ పౌరులారా! మీరంద రును మీప్రభువర్యుని వెదకి హంతకుని బట్టుకొనుటకు దృఢప్రతిజ్ఞుల గావింపుడు, నడుముల కట్టుడు" అని హెచ్చరించెను, ఆపలుకులు విని యాగుంపునందున్న రమేశదత్తు ముందునకు వచ్చి "అమాత్య శేఖరా! రాకుమారీ! ఇదిగో, కత్తి ముట్టి ప్రమాణము గావించు చున్నాను. రాజేంద్రుని రక్షించి మరల సింహాసనాసీనుం గావించు టకై నాప్రాణములనైన ధార యొనర్చెదను." అని భూమ్యాకాశ ములు దద్దరిల్లునట్లు భీకరాట్టహాసంబున నరచెను. ఆభీషణప్రతిజ్ఞ విని వారంద రాశ్చర్యనిమగ్ను లైరి. అందరును నేకగ్రీవముగ "మే మందరముంగూడ సంసిద్ధులము." అనిరి. వారిభీకరవాక్యము లాలించి మంత్రియు, రాకుమారియుగూడ సంతోషించిరి. మరికొంతసేపటి కెల్ల రును ఆస్థలము వాసిరి. రమేశదత్తుమాత్రము కర్తవ్య మాలో చించుచు నచ్చటనే నిలచియుండెను. అతనిముఖమునఁ గార్యదీక్ష తాండవించుచుండెను. రాకుమారి యాతని దీర్ఘాలోచన గాంచి యాతఁడు తప్పక కార్యసాఫల్యము గాంచునని తలంచెను. అమా త్యుఁడుగూడ రమేశదత్తును గాంచి, యొక్కపరి శిరఃకంపము గావించి, రాకుమారికడ వినయంబున సెలవంది వెడలిపోయెను. రమేశదత్తుకూడ మరికొంతసేపటి కాస్థలము వదలెను.

అందరును వెడలిపోయిన పిదప, రాకుమారి చింతాకుల స్వాంతయై 'అక్కటా! ఎంతటి దుఃఖము సంభవించినది! అమిత సైన్య భటరక్షితమైన రాజసౌధమున సునాయాసముగ జొరఁబడి రాజును తిరస్కరించుట సామాన్యవిషయము కాదు. అన్యు లంత సునాయాసముగ సౌధముఁ జొరబడగలరా? కల్ల. మాభటులలో గొంద రాచోరునకుఁ సాయ మొనర్చుచున్నా రాతఁడింత సులభముగ దనకార్యమును నిర్వహించుకొనఁ జాలడు. ఆహా! మాదాన్యముచే జీవించుచున్న దుర్మార్గు లెంతటి కృతఘ్నులైరి! పరాత్పరా! మాపై నెంతటి నిర్దాక్షిణ్యము బూనితివి? మే మొనరించిన యపరాధ మేమి? నాజనకుఁడు తనయుద్యోగులనందఱును గంటికి రెప్పవలె నాదరించుచుండెనే, అట్టిచో వారింతటి దుర్మార్గము బూనుటకు హేతు వేమయి యుండును? కుతంత్రులు — స్వామిద్రోహులు — చిరకాలముగ — పరాత్పరు డనుగ్రహించినచో నిఖిలులు వారిద్రోహచింతలకుఁ దగినఫలితము ననుభవింపక పోరు. అని చింతించుచు నామె తలుపును బంధించుకొని శయనికం బోయెను. నిశాశేషమును నిద్రలో గడుపవలయునని తలంచెను. కాని యామెకు నిద్ర పట్టలేదు. హృదయము భయాకుల మయ్యెను. ఆమె కర్ణరంధ్రములఁ దెల్లవారువరకును గూడ చోరునిచే 'అష్టాలంఘున మహానుదాయక...!' అని వ్రాయబడిన యక్షరములు ప్రతిధ్వనించుచునే యుండెను. ఆభీకరవచనము లాలించిన పురుషులు సైతము భయాంకులస్వాంతులు గాకుండరు, శుకపికారావములకే గుండె దిగుల్లు మను యువతి — యాపాషాణహృదయుని కమ్మను గాంచి భయపడుట యం దాశ్చర్య మే మున్నది?

—•—

# రెండవ ప్రకరణము.

———:0:———

తెల్లవారెను. పక్షులు కిలకిలారావంబులఁ దమదమ కులాయముల వీడుచుండెను. వేదాధ్యయనపరాయణులు సూర్యోదయ కాలముననే దివాకరున కర్ఘ్యప్రదాన మొసర్ప నాతురపడుచు గంగానది కరుగుచుండిరి. కొందఱింకను శయ్యాగారములనుండి యీవలకు రానేలేదు.

అట్టిసమయమున గంగాతీరమున నున్నయొక యున్నతకంబమున నొకప్రకటనపత్రము కట్టబడియున్నది. ఆప్రకటనపత్రమేమో చూడవలయునని ప్రేక్షకు లొకరి నొకరుత్రోసికొనుచుండిరి. ఆజనసమర్దమునం గొందరు క్రిందపడి గంగానదిలోనికిఁ గట్టబడిన చీడీలమీదనుండి దొర్లిపోయి ప్రవాహమునం బడుచుండిరి. కొందరు క్రిందపడి ప్రేక్షకుల పదతాడనంబున లేవలేక నలిగిపోవుచుండిరి. కాని యాప్రకటనమందలి విషయమునుమాత్ర మెవ్వరును తెలిసికొనఁజాలకపోయిరి. పాఠకులారా! వా రందరంతటియాతురముతో తిలకించుచున్న యాప్రకటనమందలి విశేషము లేమయి యుండును?

చూడుడు. కొంతదూరమునుండి యిరువురు హయారూఢులరుదెంచుచుండిరి. వారుకూడ నాప్రకటనను చూడవలెననియే వచ్చుచుండిరి. వారిరువురనుగూడ యాజనసమూహమును సమీపించినంత నాప్రేక్షకులు భయవినయంబులు గదుర నాహయారూఢుల కభివాదము లొనరించి ప్రక్కలకు తప్పుకొనిరి. చదువరులారా! వా రెవ్వరై యుందురు? నందొకడు విలువవసనంబులఁ ధరించియుండెను. ఆతఁడే మంత్రి రెండవయాతడొక

భటుఁడు. రమేశదత్తు ఇరువురునుగూడ నాప కటనపత్రమును తిలకించిరి. అందిట్లు వ్రాయబడి యుండెను.

"పౌ రు ల కు హె చ్చ రి క"

పరిపాలనా విధానమునందలి యన్యాయముల రూపు మాపి ప్రజా సేవ గావించుటయే రాజునకు విధి—అటిక్షాత్రదర్శనమును శాశ్వతముగ స్థాపించి, ప్రజల కాహ్లాదము గావించుటకే నే నహర్నిశాదులు పాటుపడ నిశ్చయించితిని. ఇంతటినుండి నాయత్నమునకు సహాయభూతులగు వారందరును భవిష్యత్తుగ సమితిసౌఖ్యము నంద గలుగుదురు. ఇప్పటినుండి దుర్మార్గులకై యెవ్వరును భయపడ నవసరము లేదు. అట్లు హెచ్చరించు ప్రజాసేవకురాలు,

కొ ర డా రా ణి."

ఆప్రకటన గాంచి వారిరువురును యాశ్చర్య నిమగ్నులైరి. ఎవరీకొరడారాణి పరిపాలనవిధానములలో నన్యాయము లేమి జరుగుచున్నవి? ఇంతవరకును ప్రజాక్షేమమునకు భంగ మేమి వాటిల్లినది? అను సంశయము లాయిరువురిహృదయములను యాందోళన మంద జేయ దొడంగినవి.

రమే—అమాత్యశేఖరా! ఏమియీవింత? ఈప్రకటనమునందలి యర్థ మేమి?

మంత్రి—అదియే యాశ్చర్యముగ నున్నది. కాని యాప్రకటన దిలకింప మనప్రభువర్యుని దస్కరించిన దుర్మార్గుడే యీప్రకటన మూలమునఁ బ్రజలను రాజోద్యోగులనుగూడ మోసగించి తనయత్నముల నిరాటంకముగ జరుపుకొన నెంచి నట్లు తోచుచున్నది.

రమే—కావచ్చును.

మంత్రి—సందేహ మేల? ఈపత్రికలపక్కనే యీకొరడా రాణిని బంధించి మంత్రికి నప్పగించినవారికి రెండువందల బంగారు

నాణెములు బహూకరింపఁబడునని ప్రకటించుచు మనముకూడ పత్రి కలఁ గట్టుదము. అప్పుడు ప్రజలందరు ధనాశచే నాతుచ్ఛుని బంధింప యత్నింతురు.

రమే — అవును. అట్లొనరించుటయే యుత్తమము.

మంత్రి — నే నాపత్రికలనుఁ గావించి వత్తును. నీవు రాకుమారి కీసంగతి తెలిపి యామెయభిప్రాయ మెరింగి రమ్ము.

రమేశదత్తు డంగీకారసూచికముగ తలనూపెను వారిరువురును యాజనసమూహము వదలి చెరియొకదారిని వెడలిరి. రమేశదత్తునకు మాత్ర మేలనో మంత్రి సలహా సమంజసముగ దోచలేదు. రాజా పహారియగు చోరుఁడే యీకొరడారాణి యనుపేరునఁ బ్రవర్తించు చుండెనా? లేక రాజసేవాధురంధరులగు నింకొక రెవరైన నిట్లు ప్రవ ర్తించుచుండిరా? ఏమో! ఎట్లుచెప్పగలము? కానిండు. హంతకుఁ డనుదినము ను రాజకీయోద్యోగులు చేయవలసిన కార్యక్రమమును దెలు పుచుండు ననియే గదా! యిపు డేమయిన నట్టిపత్రము వచ్చె నేమో మంత్రి నడుగుట మరచితిని. రాకుమారి కేమయినం దెలియుట కవ కాశ మున్న దేమో తెలసికొనవలయునని తలంచుచు నతడు క్రమ ముగ రాజసౌధమును చేరెను. ద్వారముకడ నిలచి యటనున్న భటుని మూలమున రాకుమారికిఁ దనరాక తెలియఁ జేసెను. భటుండును యచిరకాలములో ననుజ్ఞాపత్రముతో నరుదెంచెను.

రమేశదత్తుం గొని కరుదెంచెను రాకుమారి తనసౌధమున నున్న పర్యంకముపై గూర్చుండి యేమియో దీర్ఘాలోచన మొనరించుచుండెను సంపూర్ణచంద్రబింబమును ధిక్కరించు నామె ముఖమున శృంగారము నశించి ధీరత్వము తాండవించుచుండెను. ఆమె దక్షిణహస్తమున నొక కాగితమున్నది. రాకుమారి యాకాగితము దిలకించుచు దీర్ఘముగ నాలోచించుచుండెను. రమేశదత్తుని గాంచినంత నా రాకుమారి యీ

ఇదిగో హంతకుని యాజ్ఞాపత్రము!' అని పలుకుచు నామె తనహస్తము నందలి కాగితము నాతని కొసంగెను.

రమేశదత్తు యాకాగితమును చూచి నివ్వెరబోయెను. 'రాకుమారీ' ఈయుత్తరమున కే మాలోచించితివి?' యని ప్రశ్నించెను.

'దత్తూ! నా కేమియుఁ బోధపడుట లేదు. కొరడారాణి చాల యుపాయకారి యట, యామెను బంధించి శిక్షించుట శ్రేయస్కరమట. ఆమాటలను నీవు విశ్వసింతువా?'

'ఏమో ఎట్లు చెప్పఁగలము? ఈయిరువురిలో నెవ్వరు మన కాప్తులో మన మేమియు నిర్ధారణ గావింపఁ జాలము.'

'నేటినుండి నిన్నుద్యోగభ్రష్టునిఁ గావింపవలయునని వ్రాసెను. అందులకు నీ వే మందువు?'

'మహాసంతోషము. కాని యిప్పటికి నాల్గువత్సరములనుండి రాజద్రవ్యముచే పోషింపఁ బడిన యీశరీరము రాజరక్షణమునకై యర్పింపవలయును. రాజును రక్షింపలేనిచో నాజీవితము వ్యర్థము?

'అయిన నీయిరువురిలో నెవ్వరిని బంధింప నెంచితివి?'

'ఇరువురినుకూడ బంధించెదను?'

'అయ్యది సాధ్యముకాని యెడల?'

'అసాధ్యమా! ఎట్టి యమంగళవాక్యములు పలుకుచుంటివి? రాజభక్తి తత్పరుండనగు నా కపజయము సిద్ధించునా? రాకుమారీ! చూతువుగాక నాప్రతిజ్ఞ. మీరు తొలగింపకుండగనే నాయుద్యోగము రాజీనామా నొసంగుచున్నాను. నా కిక సెలవు. ఇదిగో రాజేంద్రునిచే నుద్యోగచిహ్నముగ నొసంగబడిన ఖడ్గము.' అని పలుకుచు మొలనున్న కరవాలమును రాకుమారిముందుంచి వెడలిపోవ నుద్యుక్తుఁ డయ్యెను.

నాశనములు బహూకరింపఁబడునని ప్రకటించుచు మనముకూడ పత్రములఁ గట్టుదము. అప్పుడు ప్రజలందరు ధనాశచే నాతుచ్చుని బంధింప యత్నింతురు.

రమే—అవును. అట్లొనరించుటయే యుత్తమము.

మంత్రి—నే నాప్రకటనఁ గావించి వత్తును. నీవు రాకుమారి కీసంగతి తెలిపి యామెయభిప్రాయ మెరింగి రమ్ము.

రమేశదత్తు నంగీకారసూచికముగ తలనూపెను వారిరువురును యాజనసమూహము వదలి చెరియొక దారిని వెడలిరి. రమేశదత్తునకు మాత్ర మేలనో మంత్రి సలహా సమంజసముగ దోచలేదు. రాజాపహారియగు చోరుఁడే యీకొరడారాణి యనుపేరుగఁ బ్రవర్తించుచుండెనా? లేక రాజసేవాధురంధరులగు నింకొక రెవ్వరైన నిట్లు ప్రవర్తించుచుండిరా? ఏమో! ఎట్లుచెప్పగలము? కానిండు. హంతకుఁ డనుదినము ను రాజకీయోద్యోగులు చేయవలసిన కార్యక్రమమును దెలుపుచుండు ననియే గదా! యిపు డేమయిన నట్టిపత్రము వచ్చె నేమో మంత్రి నడుగుట మరచితిని. రాకుమారి కేమయినం దెలియుట కవకాశ మున్న దేమో తెలసికొనవలయునని తలంచుచు నతడు క్షేమముగ రాజసౌధమును చేరెను. ద్వారముకడ నిలచి యటనున్న భటుని మూలమున రాకుమారికిఁ దనరాక తెలియఁ జేసెను. భటుండును యచిరకాలములో ననుజ్ఞాపత్రముతో నరుదెంచెను.

రమేశదత్తు లోని కరుదెంచెను రాకుమారి తనసౌధమున నున్న పర్యంకముపై గూర్చుండి యేమియోదీర్ఘాలోచన మొనరించుచుండెను సంపూర్ణచంద్రబింబమును ధిక్కరించు నామె ముఖమున శృంగారము నశించి ధీరత్వము తాండవించుచుండెను. ఆమె దక్షిణహస్తమున నొక కాగితమున్నది. రాకుమారి యాకాగితము దిలకించుచు దీర్ఘముగ నాలోచించుచుండెను. రమేశదత్తును గాంచినంత నా రాకుమారి యీ

ఇదిగో హంతకుని యాజ్ఞాపత్రము!' అని పలుకుచు నామె తనహస్తము నందలి కాగితము నాతని కొసంగెను.

రమేశదత్తు యాకాగితమును చూచి నివ్వెరబోయెను. 'రాకుమారీ! ఈయుత్తరమున కేమ్యాలోచించితివి?' యని ప్రశ్నించెను.

'దత్తూ! నా కేమియుఁ బోధపడుట లేదు. కొరడారాణి చాల యుపాయకారి యట, యామెను బంధించి శిక్షించుట శ్రేయస్కరమట. ఆమాటలను నీవు విశ్వసింతువా?'

'ఏమో ఎట్లు చెప్పఁగలము? ఈయిరువురిలో నెవ్వరు మన కాప్తులో మన మేమియు నిర్ధారణ గావింపఁ జాలము.'

'నేటినుండి నిన్నుద్యోగభ్రష్టునిఁ గావింపవలయునని వ్రాసెను. అందులకు నీ వే మందువు?'

'మహాసంతోషము. కాని యిప్పటికి నాల్గువత్సరములనుండి రాజద్రవ్యముచే పోషింపఁ బడిన యీశరీరము రాజరక్షణమునకై యర్పింపవలయును. రాజును రక్షింపలేనిచో నాజీవితము వ్యర్థము?'

'అయిన నీయిరువురిలో నెవ్వరిని బంధింప నెంచితివి?'

'ఇరువురనుగూడ బంధించెదను?'

'అయ్యది సాధ్యముకాని యెడల?'

'అసాధ్యమా! ఎట్టి యమంగళవాక్యములు పలుకుచుంటివి? రాజభక్తి తత్పరుండనగు నా కపజయము సిద్ధించునా? రాకుమారీ! చూతువుగాక నాప్రజ్ఞ. మీరు తొలగింపకుండగనే నాయుద్యోగము రాజీనామా నొసంగుచున్నాను. నా కిక సెలవు. ఇదిగో రాజేంద్రునిచే నుద్యోగచిహ్నముగ నొసంగబడిన ఖడ్గము.' అని పలుకుచు మొలనున్న కరవాలమును రాకుమారిముం దుంచి వెడలిపోవ నుద్యుక్తుఁ డయ్యెను.

'దత్తూ! గర్భదరిద్రుండవని మాయందిరి యాదరించి యుద్యోగ మొసంగెను. ధిక్కరించి యాయదవి వదలుకొనం దలంతువా?'

'గర్భదరిద్రుండనా! కావచ్చును కాని, తిరస్కారవచనముల భరింపంజాల. రాకుమారీ! నాజననియు, మాతాతయు పౌరుషము, ప్రభుభక్తియు నుగ్గుపాలతో నూపోసిరి. ఇప్పుడు తుచ్ఛవేతనమున కాసించి నీనిందాలాపములం భరింతునను కొంటివా? కల్ల. నీయుద్యోగముతో నాకు నిమిత్తము లేదు. ఎన్నటికయిన నన్నాదరించి నా యుద్యోగ మనుగ్రహించిన నృపాలుని చెర విడిపించి సింహాసనాసీనుం గావించెదను. అదియే నాజన్మకు సార్థకము. మీరందరును యీహంతకుని యాజ్ఞానువర్తులై చరింపుడు. నాకీయాజ్ఞలతో పని లేదు.' అని పలుకుచు నాతండు బిరాన నారాజసౌధము వదలెను.

రమేశదత్తు స్వాంతము రాకుమారిహృదయమునాకర్షించెను. ప్రభుభక్తి పరాయుండనగు నారమేశదత్తుని నిరసించినందుల కామె సంతాపము నొందెను. ఆతనిం బిలువ భటుల నంపెను గాని యాతండు తిరిగి రాలేదు. మీయమిక్కిలి రాజును తిరుగ సింహాసనాసీనుం గావించినంగాని రాకుమారిమోము దిలకింపనని పలికి నన్వాతనికొఱకు బోయిన భటులు తిరిగివచ్చి నుడివిరి. రాకుమారి విద్యావతి యయ్యును కార్యదీక్షాపరతంత్రుడును, ధైర్యసాహసోపేతుండునునగు రమేశదత్తును నిరసించినందుల కామె పశ్చాత్తప్త హృదయ యయ్యెను. తానెట్టులయిన రమేశదత్తున కుపకార మొసర్పవలయునని నిశ్చయించుకొనెను. కాని యామె యేమిచేయఁగలదు? అబలయగు యామె రమేశదత్తున కేటుపకార మొనర్పఁగలదు?

ఆమె యిట్లాలోచించుచుండగనే మంత్రి వచ్చి యామె యెదుటఁ బ్రత్యక్ష మయ్యెను. 'రాకుమారీ? ఏమ ట్లాలోచించుచుంటివి?' యనెను. ఆకస్మికముగ నటపడియున్న కాగితమాతనికిం

గొనవచ్చెను. అతఁ డాకాగితమును గాంచి యాశ్చర్య మందెను. అది హంతకుఁడు వ్రాసిన యుత్తరము. దానియందు రమేశదత్తు నుద్యోగమునుండి తొలఁగింపవలయు ననియు, కొరడారాణి యనుపేరుతో దేశద్రోహమునకుం బాల్పడుచున్న యాదుర్మార్గునిఁ బట్టింప యత్నింపవలయు ననియు వ్రాయబడియుండెను. అయ్యది గాంచి, యాత డాశ్చర్యమంది 'రాకుమారీ! ఉదయమున నాకొరడారాణిపేర నూరిలో గట్టఁబడిన ప్రకటన పత్రములఁ గాంచినప్పుడే యాకొరడారాణిని బంధించినవారికి రెండువందల బంగారునాణెములఁ బహుమాన మొసంగునట్లు ప్రకటించితిని. అచిరకాలములోనే యాకొరడారాణి మనవశము కాగలదు.' అనెను.

రాకుమారి యాశ్చర్య మందెను. 'మంత్రీ! మంచిపని గావించితివి. ఆకొరడారాణి నాముండగు దుర్మార్గుని నాకడకు గొనిరమ్ము నాకసిదీర నాదురాత్ముని ఖండ ఖండలు గావించెదను.' అనెను.

'రాకుమారీ! ఇపుడుమనకు గర్తవ్య మేమి? రమేశదత్తే మయ్యెను?'

'ఉద్యోగము వదలి వెడలిపోయెను.'

'నేననుకొనినట్లె యైనది. రాకుమారీ! వాఁ డతిదుర్మార్గుఁడు. పరహింసాపరాయణుఁడు. వాడే యన్ని యనర్థకములకు మూల కారణమని తోచుచున్నది.

ఆపలుకుల కామె యాశ్చర్య మందెను. రమేశదత్తుపలుకులం దును ముఖమునందునుఁగూడ గంభీరము, ధైర్యము, ప్రభుభక్తి తాండవించుచున్నది. మంత్రి యాతఁడే పితృవును బంధించినట్లు చెప్పుచుండెను. ఇందెవ్వరిని విశ్వసింప వలయును? తనశ్రేయస్కామి యెవ్వరు? అను భావములతో నామె యాలోచించుచుండెను.

'మంత్రీ! ఈవిషయ మీవర కెరింగినచో నాతని నిటనే బంధించి యుండును గదా'

'పోనిమ్ము మించినదానికి చింతించిన నేమి ప్రయోజనము? వానిని రాజసౌధమునకు రానీయకున్నచో నేమియుఁ జేయజాలడు.'

'సరే. కాని మంత్రి! అచిరకాలములో నాజనకుని విడిపించు యత్న మొనర్ప వలయును. పొమ్ము.'

మంత్రి వెడలిపోయెను. రాకుమారి కొంతసే పేదియో యాలోచించి పిదప తనదినకృత్యముల నిర్వర్తింప నరిగెను.



# మూడవ ప్రకరణము.



వారముదినములు గడచిపోయినవి. ఇంతవరకును హంతకుని సంగతిగాని, లేక కొరడారాణి చరిత్రగాని తెలియులేదు. మంత్రిగాని, తదితరరాజకీయోద్యోగులుగాని, రమేశదత్తుగాని యాకొరడారాణిని, హంతకులను బట్టుకొనుటకు యత్నించినట్లు గూడ గాన్పింపలేదు. రాజకుమారి యేమియుం దోచక యాలోచనామగ్నయై సౌధమునం గూర్చుండియుండెను. ఇంతలో నొకసేవకుండు వచ్చి రాజకుమారికి నమస్కరించి నిలచెను. ఆభటునింగాంచి యామె 'ఓరీ? నీవు వెళ్ళినపని యేమయినది?' యని ప్రశ్నించెను.

'అమ్మా! మీరు చెప్పినప్రకారము రమేశదత్తు యింటి కరిగితిని. ఆతనితల్లి రోగపీడితయై యుండెను. ఔషధసేవయైన గావించుటకైన నాతనికడ పైకము లేదు. వా రనుభవించుచున్న దరిద్రమును గాంచి నాహృదయము నీరయిపోయినది. కాని యేమి చేయఁగలను. నే నాతని కేమియు నుపకారము గావింపఁ జాలకపోతిని.'

'అయినచో నీపైకమును గొనిపోయి యాతని కిచ్చిరమ్ము.' అని పలుకుచు నామె యొకరూకలసంచి నాతని కిచ్చి యంపెను. ఆభటుం డాసంచిగైకొని వెడలిపోయెను. రాజకుమారి యాలోచనానిమగ్నఁ యయ్యెను. రమేశదత్తు తా నంపిన ద్రవ్యమును గైకొననిశ్చగించునా? అంగీకరింపడు. మంత్రి నడిపి స్వార్థతఁడు పరహింసాపరాయణుఁడు.. దుర్మార్గుడే యైనచో చేజిక్కిన ధనమును వదలునా? రాజకుమారి యిట్లాలోచించుచుండగనే యాభటుఁడు మరల రూకలసంచితో తిరిగి వచ్చెను. రూకలసంచిని రాజకుమారి ముందుంచి, 'అమ్మా! దత్తు

రూకలసంచిని గైకొనక, యన్యాయముగ దా నొకరిద్రవ్యమును
గైకొన నిశ్చగింప నని పలికెను. ద్రవ్యమును గైకొనుమని నే బ్రతిమా
లితిని. నే బ్రతిమాలినకొలది యాతని యాగ్రహ మెక్కువయ్యెను.
చేయునదిలేక తిరిగివచ్చితిని.' అనెను.

ఆహా! ఏమి యీతని సత్యదీక్ష! తినుటకు తిండిలేక పోయినను,
ఔషధరహితయై తల్లి మరణించుటకైన నాతఁ డంగీకరించెను. గాని
యన్యాయముగ నామె యొసంగు ద్రవ్యము స్వీకరింపలేదు. ఆతని
యుదారత శ్లాఘాపాత్రముకదా!

రాకుమారి చాలసే పాలోచించి యాభటునితో నే మేమో
రహస్యముగ నుడివెను, భటుఁడు హర్షదవదనుఁడై వెడలిపోయెను,

పాఠకులారా! మన మొకపరి రమేశదత్తుగృహమున కరుగుదము
రోగపీడితయై యున్నజనని మంచముకడకూర్చుండి రమేశదత్తువిచారించు
చుండెను, 'కటకటా! నేనెంతకొఱమాలినవాడనైతిని. కన్నతల్లికిగంజెనీళ్ళు
పోయ జాలని నాజీవితము కాల్పనా? వైద్యుఁ డరుదెంచి పది రూప్య
ముల నొసంగినంగాని మందు దొరక దనెను. ఇప్పటికి రెండుదినముల
నుండి నాకు భోజనమే లేదు. అట్టిచో నిప్పుడు పదిరూప్యము లెట్లు
వచ్చును? విక్రయించుటకైన నాకడ నేమియు లేదే. ఎట్లు ద్రవ్యము
లభించును. కానిండు. నాతాత యొసంగిన గుఱ్ఱ మున్నదిగదా!
దానిని విక్రయించెదను.' అని నిశ్చయించుకొని యాతఁ డీవలకు వచ్చి
వీథిలోనున్న హయము నధిరోహించి యంగడివీథి కరుగుచుండెను.

ఆతఁడు తనగేహము వీడి కొలదిదూర మరిగినంత మరియొక
యువకుఁడు హయారూఢుఁడై యాతని నెదుర్కొనెను, రమేశదత్తును
గాంచి యాయువకుఁడు 'అయ్యా! మిమ్ములం గాంచినధీరోదారులని
తోచుచున్నది. చూడుడు. కొరడారాణి నివసించుతావు నెఱింగితిని.
కాని యామెను బంధింపగలనో లేనో యని భీతి గలుగుచున్నది. నాకు

సాయ మొనర్తురేని యామెను బట్టుకొనుటవలనం గలుగుబహుమానములో మన మిరువురమును సమానముగ తీసికొందము.' అనెను.

ద్రవ్యార్థమై పాటుపడుచున్న రమేశదత్తు ఆయువకుని పలుకుల కంగీకరించి యాతని వెంబడించెను. వారిరువురును బయలుదేరి నగరము వదలి కొంతదూర మేగిరి. ఆకస్మికముగ ముందుబోవుచున్న పురుషుఁడాగిపోయెను. రమేశదత్తుకూడ నాగిపోయెను. ఇరువురును గుర్రము దిగిరి. మొదటియువకుఁడు రమేశదత్తునుగాంచి 'చూడుడు. ఆకనఁబడుచున్న పాకలలోనే యాకొరడారాణియు, నామెసేవకులును నివసించుచున్నారు. వా రందరును గూడ వీరశిఖామణులు. రమ్ము. గుర్రముల నీచెట్టునకుఁ గట్టి వారిగుడారములకు బోవుదము.' అని పలికి యాపురుషుఁడు తనహయమును బంధించి యాపాకలవైపున కరుగసాగెను. రమేశదత్తుగూడ తనహయమును గట్టివైచి యాతని వెంబడించెను. వా రిరువురును గూడ యాపాకలను చేరిరి.

ఆపాకలు చాలచిన్నవయినను చూచుచుట కతిమనోహరముగ నుండెను. ఆపాకలసమీపమందున్న యొకమామిడిచెట్టుక్రింద నాకొరడారాణి యనుచరు లందరును కూర్చుండి శృంగారముగ నృత్యగీత వాయిద్యములతో కాలము గడుపుచుండిరి. యువకుఁడు వారిని సమీపించి, 'ఓయీ! మారాణి యెక్కడనున్నది?' అని ప్రశ్నించెను.

'ఎందులకు? మారాణి సామాన్యులకు దర్శన మొసంగదు.'

'మేము సామాన్యులము గాము. మీరాణితో నేవిషయమునను తీసికొనుపోవువారము కాము.'

'అయినచో మమ్ము ముందు జయించుడు. తరువాత మారాణి మీకు దర్శన మొసఁగగలదు.'

'సరే. కాచికొండు.' అని పలికి యాయువకుఁడు వెనుదిరిగి రమేశదత్తువైపు చూచెను, వా రిరువురును కత్తులందీసి యాయనుచ

రులపై కలియబడిరి. ఎంతసాహస వంతులైనను యధర్మయుద్ధమున నెట్లు తాళఁగలరు. సరిగ వారొకజామువరకును నాయనుచరులతో పోరిరి. తుద కాయనుచరులు రమేశదత్తును గూలినిం గొనివచ్చిన యువకుని బంధించిరి. ఒకభటునివలన నాసమాచార మెరింగి యాకోరడారాణి యచ్చటి కరుదెంచి రమేశదత్తును గాంచి, వికటహాసము గావించుచు 'దత్తూ! శౌర్యవంతుడవు గదా? నాయనుచరులతోడనే పోరలేకపోతివా?' యనెను.

'ఓహోహో! మీరందరును పరాక్రమవంతులేగాని యేమి ప్రయోజనము? మీపరాక్రమ మధర్మయుద్ధమునందేగాని ధర్మయుద్ధమున నిసుమంతయు నుపయోగింపదు.'

'అదే మట్లనియెదవు? నాయనుచరులు మిమ్మధర్మ యుద్ధమున బంధించిరా?'

'అవును.'

'అయినచో మిమ్ము బంధవిముక్తులఁ గావింతును. మీవిద్యా పాటవము చూపెదరా?'

'అవశ్యము. చూపుటయే గాదు. నిను బంధించి మంత్రి యెదుటఁ బెట్టి యాతనివలన రెండువందల బంగారునాణెముల బహుమానముగూడ వడసెదను.'

రాణి వారిరువురను బంధవిముక్తుల గావింప వలసినదిగా నాజ్ఞాపించెను. ఇరువురును విముక్తులైన పిమ్మట యూరాణి రమేశదత్తున కొకఖడ్గము నొసంగి తానుకూడ నొకఖడ్గము గైకొనెను.

'రమేశ్! రమ్ము. నీపరాక్రమము చూపుము.'

ఇరువురును సంగ్రామమునకుఁ దలపడిరి. వారి పోరాటము చూచువారి కత్యాశ్చర్యము కలిగించెను. ఆహా? ఏమి వారినేర్పు! రమేశునితో వచ్చిన యువకుఁడును, కోరడారాణి యనుచరులునుగూడ

పోరాటము మరచి వారియిరువురపోరాటమును చూచుచు నిలువఁబడిరి. వారిరువురుఁ గాంచిన నరనారాయణులు కాలవశంబున వైరమూని పోరాడుచున్న దృశ్యము స్ఫురణకు వచ్చుచుండెను. ఎంత కాలమయినను వారిద్వంద్వయుద్ధమున కంతము కాన్పించుటలేదు. వారి శరీరము లలసట చెందుచుండెరు. ఎంత శౌర్యమున్నను స్త్రీ పురుషునకీడగునా? ఆకస్మికముగ నామె చేతియందలి ఖడ్గము రమేశుని ప్రవీణతచే దూరముగ నెగుర గొట్టఁబడెను. రమేశుఁడత్తు నవ్వుచు, 'ఓహో. వీరశిఖామణీ! ఇపు డెవ్వరు గెలచిరి' యనెను.

రాణి మందస్మితవదనయై, 'రమేశ్! నేను నిన్నుఁ గెలచిన సమిత విఖ్యాతి గడింతునుగాని నీకు నోటుపడుటను నాకించుకయుఁ బరాభవము కలుగనేరదు సుమా!' యనెను.

'ఎందు చేత?'

'నీవు పురుషుఁడవు నేనబలను. ఒకయబలను జయించుటకూడ పౌరుషమేనా?'

'అబలవు గావుననే నీశరీరమున కొక్కగాయమైనఁ గలుగకుండ ని న్నోడించితిని. పురుషుఁడైనచో నింతశ్రమ పొందకుండగనే యమసదనమున కంపియుందును.'

'నీవంతటి వాఁడవని నిను దర్శించినప్పుడే యనుకొంటిని కాని న న్నిప్పు డేమిచేయఁ దలంచితివి?

'చూచియుండలేదా యమాత్యశేఖరుల ప్రకటనము? నిన్నాతని యధీన మొనర్చి యాతనివలన బహుమాన మందఁ దలచితిని.'

'ఏమి! నన్ను మంత్రికి వప్పగింతువా? వలదు. నీయాజ్ఞాబద్ధురాలనై చరించెదను. నీ కాతఁ డొసంగుబహుమానము నేనే యొసంగెదను.'

'ఛీ! అదిక్షాత్త్రధర్మము కానేరదు. ఎవ్వతెవలన దేశక్షేమము నకు భంగము కలుగుచున్నదో యామెను ధనాశచే వదలు మందువా? కల్ల. రమేశద త్తెన్నడును ప్రభుద్రోహి కానేడు?'

'నీ వాచరించుచున్నది ప్రభుభక్తికార్య మందువా? ఎరుంగక హాలాహలంబు నమృతము గా గ్రోల నెంచుచుంటివి. నను బంధించు టకు రాకుమారి యనుమతించెనా!'

'నీమాయమాటలు నాకడ గట్టిపెట్టుము రాకుమారియాజ్ఞతో నాకిసుమంతయు సంబంధము లేదు. రాకుమారి యబల భయభ్రాంత హంతకుని బెదరింపులకు బెదరి నన్నుద్యోగభ్రష్టునిం గావించి యంత తో నూరకుండక నన్ను రాజద్రోహి యని నిందింప సాహ సించిన యామె యాజ్ఞతో నా కేమి పనియున్నది? నాప్రభుని చెర విడిపించి, యాతని మరల సింహాసనాసీనునిం గావించుటయే నాకర్తవ్యము.'

'అయినచో రాజును నేను బంధింపలేదుకదా! నన్ను బంధిం చుటన్యాయము కాదా?'

'నా కది తెలియదు. అమాత్యశేఖరుడు నిన్ను బంధింప నెంచెను. అందుచే రాజు లేనందున రాజతుల్యుండగు యాతనియాజ్ఞ పాలించుచుంటిని.

'దత్తా! నహితవాక్యము లిప్పుడు నీచెవి కెక్కవు. కానియచిర కాలములో నే నెట్టిదాననో, నావాక్యము లందెట్టిమహత్తర రహస్యమున్న దో నీవే తెలసికొనగలవు. నీయిష్టప్రకారమే నన్ను మంత్రియధీన మొనర్చి బహుమానము గైకొమ్ము.'

'రమ్ము. ఈసమీపముననే నాగుఱ్ఱ మున్నది. ఆగుఱ్ఱముపై నిన్ను రాజాస్థానమునకు గొనిపోయెదను.' అనిపలుకుచు నామెను బం ధించి తనతురగ మున్నతావునకుం గొనివచ్చెను. అతని వెనుకనే యాత

నివెంటనున్న యువకుఁడుగూడ గుర్రమును సమీపించెను. రమేశదత్తు కొరడారాణినిగూడ నాతనిగుర్రము మీఁదనే కూర్చుండఁజేసి రయంబున మిత్రునితో సహా ప్రయాణము సాగెను.

అచిరకాలములోనే వారు ముగ్వురును సభాస్థలమందు చేరిరి. పౌరుష విహీనుఁడు, దుర్మార్గుఁడుగా భావించిన రమేశదత్తు తనకుం గర్భశత్రువురాలు ప్రజాక్షేమకారిణి యగుకొరడారాణిని బంధించి తీసికొనివచ్చుట చాల యాశ్చర్యకర మయ్యెను. రమేశద త్తెట్టివా డయినను, రాణి బంధితయైనందుల కానందించెను.

రమేశదత్తామెను సభాస్థలంబున నిలిపి 'అమాత్యశేఖరా! ఇదిగో మీ ప్రకటన ప్రకార మీమెను బంధించి తెచ్చితిని. మా బహుమానము మా కొసంగుడు.' అనెను.

మంత్రి తా నొనరించిన వాగ్దానప్రకారము రెండువందల బంగారు నాణెములను రమేశదత్తున కొసంగెను. దత్తుం దర్ధభాగము తన వెంట వచ్చిన యువకున కొసంగి మంత్రికడ సెలవు గైకొని వెడల నుద్యుక్తుఁడాయెను. రాణి వెడలిపోవుచున్న దత్తును గాంచి, 'దత్తూ! నీవు ధనముతో సుఖముగ నిలువఁ జేరగల వనుధైర్యము నాకుఁ దోచుటలేదు జాగ్రత్త!' అనెను. అందులకు రమేశద త్తేమియుం బ్రత్యుత్తర మొసంగక యొక్క వికటహాసము మాత్రము గావించి వెడలి పోయెను. ఆహాసమునందు నిర్లక్ష్యభావము తాండవించుచుండెను. అవును పరాక్రమసంపన్నుఁడగు దత్తు స్త్రీవచనములకుం బెదరునా?

దత్తు వెడలిపోయిన పిదప మంత్రి రాణిం దిలకించి, 'ఓవీరనారీ వతంసమా! ఇపు డెందు బోఁగలవు? నాయధీన మైతివి? నీ వెవ్వరవు? చ్ఛన్న వేషధారణమునకు కారణమేమి?' యని ప్రశ్నించెను. రాణి నవ్వుచు 'ఓహోహో! ఏమి వీరాలాపములు! అప్పుడే నీయధీనమైతినని

తలంచితివా? నాచరిత్రము కావలయునా? కుత్సితుడా, నే చెప్పకుండ గనే తెలిసికొనం గలవు,' అనెను,

ఆమె నిరసనవచనము లమాత్యున కాగ్రహము కలిగించినవి. తోడనే యాతఁడు భటులనుదిలకించి, 'భటులారా! మీ రీమెను నేటికి కారాగృహమున నుంచుఁడు. రే పీమెకు దగినశిక్ష యొనర్తును.' అని గంభీరముగ పలికెను. రాణి యప్పుడుకూడ చలింపలేదు. తన్ను సమీపించుచున్న భటులంగాంచి, దుర్మార్గులారా నన్నుసమీపించిన మీప్రాణము లెగిరిపోవును. జాగ్రత' అని పల్కుచు నామె తనచేతులకు బంధింపఁబడినత్రాటి నవలీల ద్రెంచివైచి క్షణములో నాస్థలమునుండి యదృశ్యమయ్యెను. మంత్రియు నచటనున్న భటులునుగూడ నాశ్చర్యమందిరి. మంత్రి రౌద్రావేశుడై 'భటులారా రమేశదత్తు మనను మోసగించి ద్రవ్యమును గైకొనెను, నే నూహించినట్లు రమేశదత్తు కూడనాకొరడా రాణికి సంబంధించినవాఁడే. తక్షణమే పోయి యారమేశదత్తును బంధించి మనద్రవ్యమును గొనిరండు అని యాజ్ఞాపించెను. ఆపలుకులు పూర్తిగ నాతని పెదవులు దాటకుండగనే యాభటులు నాహయంబుల పై బయలుదేరి రమేశదత్తును తరుమసాగిరి.

భటులందరును వెడలినపిదప మంత్రి రాణికరములకు బంధించిన త్రాటిని పరీక్షింపసాగెను. అయ్యది చాలదృఢముగనుండెను. అంతటి దృఢపాశబంధమును రాణి యెట్లు త్రెంపగలిగెనా యనియాతడు సందేహింపదొడంగెను. చాలసే పాలోచించి తుద కాచరిత్రమంతయు రాకుమారి కెరింగింపవలయునని నిశ్చయించుకొని సభాస్థలము వీడెను.

—♦—

# నాలుగవ ప్రకరణము.



మంత్రిచే బహూకృతుఁడై సభామంటపము వదలిన రమేశదత్తు తనయదృష్టమున కచ్చెరు వందుచు రాజమార్గము వెంట హయారూఢుఁడై వచ్చుచుండెను. ఆతని హృదయమున కొండారాణి పలికిన ప్రతివచనము తర్కవితర్కములతో యథార్థనిరూపణఁ బడయకుండగనే జరిగిపోయిన యాస్థానమున మరియొకటాక్రమించుచుండెను ఇట్లాతడు పలుతెరంగుల యాలోచనలతో మునింగియుండుట చేతనాతనిగుఱ్ఱముకూడ నానగరవీథులయందలి వింతలం గాబోలు తిలకించుచు మందగమనంబున నడచుచుండెను. తా నమృత మనుతలంపున హాలాహలంబునుఁ గ్రోలఁబోవు చున్నాఁడట. ఆమెపలుకులయందలి యథార్థ్యము క్రమముగాఁ దెలియఁగలదట. ఈమాటల యర్థమేమి? మంత్రి దుర్మార్గుఁడని యామె తలంపా? అది విశ్వసనీయమగునా? ఏమో యెటు చెప్పఁగలము? ఏపుట్టలో నే పామున్నదో యెట్లు చెప్పఁగలము? ఒక్క విషయము. మంత్రి దుర్మార్గుఁడైనచో కొండారాణి నిజమైనదేశసేవకురాలు. రాణి ద్రోహియైనచో మంత్రి మంచివాఁడు.

ఈయాలోచనతోనే రమేశదత్తు మెల్లగ గుఱ్ఱముపై పోవుచుండెను. ఇంతలో నాకస్మికముగ నలువురు దొంగ లరుదెంచి యాతని చుట్టుముట్టిరి. పాపము. రమేశదత్తు మరల శత్రువులతో పోరవలసి వచ్చెను. ఆనాడాతడు కొండారాణితో సల్పినపోరాటముననే యాతని శరీర మంతయు బడలియుండెను. ఆపోరునం దగిలిన రెండుమూడు గాయములిప్పు డాతని బాధించుచున్నవి. అందుచే నాతఁ డాదొంగలతో పోరఁజాలకపోయెను. శత్రువులు మరల నాతని బంధించి యింతని

వస్త్రాభ్యంతరమున దాచుకొనియున్న రూకలసంచిని యపహరించిరి. వా రంద రేకగ్రీవముగ రమేశదత్తును నిందింపసాగిరి. అం దొక్క డిట్లనియె.

దుర్మార్గుడా! నీవును యీకోరడారాణియు నేకమై మమ్ము వంచింప నెంచితిరా? అమాత్యులు వీరామోస మెఱుంగలేక యింత ద్రవ్యము వెచ్చించెను, ఆరూకలసంచి నిచ్చివేయుము. నీమిత్రునికడ నున్న ధనమును గైంకొంటిమి నీవుకూడ యిమ్ము.

క్షత్రియులారా! ఇది రాజద్రవ్యము కాని మంత్రి ముల్లెకాదు. రాజసేవాదురంధరుండ నగుటచే రాజద్రవ్యము తినుటకు నాకును యధికారము కలదు. అదియుంగాక మే మొనర్చిన మోస మే మున్నది? మీమంత్రివశము గావింపఁబడినది గోరడారాణి కాదందురా?'

'అవును. కాని యామె పారిపోయినది.'

'దానికి నే నేమి చేయఁగలను? మీవశము చేయగలుగుటయే నావంతు. ఆమెను మీరు బంధింపలేనిచో నే నేమి చేయఁగలను?'

'అందుచేతనే నీవు వంచకుఁడ వైతివి. మే మందరము చేరి బంధింపజాలని యామెను నీ వొంటరిగ బంధించితివనుట హాస్యాస్పదము.

రమేశదత్తునకు నవ్వు వచ్చెను. ఆహాసము భటులకు హృదయశల్యమై బాధ కలిగించెను. వా రతిరోషంబునఁ గలియఁబడి యాతని కడనున్న ధనమును బలవంతముగా లాగికొని వెడలిపోవ నుద్యుక్తులైరి. కాని ధర్మమున కెన్న డపజయము సిద్ధింపదుగదా! రమేశదత్తు తనశక్తి నంతయు ధారవోసి కోరడారాణిని బంధించి మంత్రియధీన మొనరించెను. అందుచే నాబహుమాన మాతనికిఁ దప్పక చెందవలసినదే. దాని నన్యాయముగ మంత్రి తిరుగఁగైకొన నెంచినచో నధర్మ మదుగంట నశింపఁజేయుటకై కంకణము గట్టుకొనియున్న రాణీ యూరకుండునా? తన్ను బంధించుటచేతను వైరియైనను ధర్మకార్యాసక్తుండు

ను, ప్రభుసేవాదురంధరుండు నగుటచే రమేశద త్తామె కత్యాంపృం డ య్యెను.

ఆకస్మికముగ హయారూఢయై రాణి యాస్థలమునఁ బ్రత్య క్షమై తనకరము నలంకరించుచున్న కొరడాతో నాభటులమోద నారం భించెను. వారా దెబ్బల కాగజాలక రమేశదత్తువద్దనుండి గైకొ నిన ధనపుమూట నటనే పారవైచి పారిపోయిరి. రాణి యాసంచితో రమేశదత్తును సమీపించి "దత్తూ! నీవు సభాస్థలంబునుండి వెడలిపోవు నప్పుడు నే పలికినపలుకుల యథార్థ మిప్పుడు బోధపడినదా?" అనెను.

'కాని నే నమాత్యునిభటులవసల నిట్టి విపత్తు సంభవించునని యనుకొనలేదు. నిను బంధించిన యాగ్రహంబున నీయనుచరులు న న్నడ్డగింతు రేమో యని భయపడితిని.'

'అవును. గొత్తె గొంతు కోయువానినే నమ్మునట. లెమ్ము. నాగుర్రముపై నిన్ను నీయింటికిం గొనిపోయెదను. ఇదిగో నీరూకల సంచి.' అని పలుకుచు నామె గుర్రము డిగ్గి రమేశదత్తు కట్లనువిప్పెను. దత్తుగుర్రముమాత్రము పారిపోక యచటనే నిలచియుండెను. దత్తు దానిని గాంచినంతనే యానంద మందెను. 'రాణీ! అదిగో నాగుర్రము. దాని నారోహించి వచ్చెదను.' అని బలుకుచు నాతఁడు తనగుర్రము నధిరోహించెను. ఇరువురును నేమేమో మాటలాడుచు రమేశుని గృహమును సమీపించిరి. అంతదనుక రమేశద త్తామెతో మాటలాడు చుండెనే గాని మనసిచ్చి మాటాడుట లేదు. వైరులు తమమోసము నిగాఢముగ నెరవేరుటకై వైరుల కిష్టప్రకారములు గావించు చున్నట్లు నటించి వారికిఁ దమపై గల యనుమానములను రూపుమాపు కొన నెంచుచుందురు. రాణికూడ యందుకొరకే యత్నించుచున్నదని రమేశదత్తు నిశ్చయించుకొనెను. అందుచేతనే యాతఁడామెను విశ్వ సింపలేదు.

అయినను గాలిపించుట మంచిదనితలంచి యాతడిలు సమీపించినంతనే 'తరుణీ! మాగృహములోనికి రమ్ము. ఇంచుక విశ్రమించి వెడల వచ్చును' అనెను. కాని యామె వాని యభిలాష దీర్ప నంగీకరింప లేదు. 'దత్తూ! ఇప్పుడు నీకోర్కె దీర్పజాలను. కొలదికాలము గడచినపిదప నీయాతిథ్యమును స్వీకరింతును లెమ్ము.' అని పలుకుచు మందస్మితవదనయై యామె రయంబున నచ్చోటు వాసెను. దత్తు యింటిలోని కరిగి చూచెను. తనతల్లి కూర్చుండి యుండెను. తానిల్లు వదలునప్పటికి స్పృహ లేక పడియున్నతల్లి యటు కూర్చుండ గలిగిన దులకు సంతోషించెను.

'అమ్మా! ఎట్లున్నది?'

'నాయనా చాల క్షేమముగ నున్నది. నీవు పంపిన యౌషధము తీసికొంటిని. పండ్లు రెండుమాత్రము భుజించితిని. మిగిలిన వింకను బల్లమీదనే యున్నవి.

దత్తాశ్చర్య మందెను. తాను మందు పంపుటయా! అసత్యము. తాను పండ్లుగాని ఔషధముగాని పంపియుండలేదు. ఎవ్వరో తానెరుంగని తనయాప్తులు తన కీయుపకారము గావించియుందురని యాతడనుకొనెను వా రెవ్వరో తెలిసికొన వలయునని యాతని కాతరము హెచ్చెను. తనకు ద్రవ్యము పంపిన రాకుమారి తా నిలువీడినంతనే తాను పంపినటు మందును తెచ్చి తనతల్లి కొసంగియుండునా? అవును రమేశుని బుద్ధికామె కన్న నాప్తు లున్నట్లు తోచలేదు. అయినను తన సందేహము నివారణ గావించుకొన దలంచి, అమ్మా! మందు గొని వచ్చినవా రెట్లుండిరి? ఏమయినం జెప్పిరా?' యనెను.

'మనవైద్యుడును యాతనివెంట నొకస్త్రీయును వచ్చిరి. ఆ స్త్రీయే నన్ను లేవదీసి యౌషధసేవ చేయించినది. కొంతసేపయిన పిదప

వైద్యుఁడు వెడలిపోయెను. ఆయువతి చాలసేపు కూర్చుండి నాకు చాలధైర్యము గలిగించినది. అరగంట క్రిందటనే వెడలిపోయినది.'

దత్తు మరింత యాశ్చర్యనిమగ్నుఁ డయ్యెను. వైద్యునివెంట వచ్చిన యువతి రాకుమారియై యుండునా? అసంభవము. శుద్ధాంతముల నివసించు రాకుమారి పాదచారియై గర్భ దరిద్రుఁడగు నాతనిగృహమున కరుదెంచునా? అసంభవము. ఆమె తనపరిచారికలలో నెవ్వరినేని పంపియుండెననుట నిశ్చయము. అతఁ డేమియు పలుకక వైద్యునడిగి యంతయు నెరుంగవచ్చునని తలంచెను. తనయాశ్చర్యమును తల్లికి వెల్లడింపలేదు. ఆలోచనా నిమగ్నుఁడై యొక కుర్చియందు కూర్చుండి యుండెను.

కొంతసేపటికి వైద్యుడు ప్రవేశించి దత్తుయాసనమునకును తల్లి మంచమునకును మధ్యనున్న యొకకుర్చీపై కూర్చుండి యామె శరీర స్థితిని గూర్చి ప్రశ్నించుచు ప్రత్యుత్తరములం బడయుచుండెను. దత్తు మాత్రము నిమీలితలోచనుడై యాలోచించుచుండుటచే నాసమయమున జరుగుచున్న సంభాషణమేమియు నెరుంగడు వైద్యుడు తన్ను పిలచువరకును యాతఁడు బాహ్య ప్రపంచకమునకు వచ్చియుండలేదు.

'దత్తూ! నిద్రించుచుంటివా?'

ఆపిలుపే దత్తును తెలివికిఁ దెచ్చెను. ఆతడు కనులు విచ్చి 'భిషగ్వరా! మీరు వచ్చి యెంతసేపయినది?' అనెను.

'ఒకగంట కావచ్చినది. కానినీవు పైకముపంపిన స్త్రీయెవ్వరు? నేనును యావిషయమే యాలోచించుచుంటిని. నే నెవ్వరి చేతను పైకము పంపలేదు. కాని యాస్త్రీ యెట్లున్నది?'

రంభను మించిన సుందరి. బృహస్పతిని మించిన జ్ఞాని' ఆమె

యుపచారములచే నెంతటి బలవత్తరమైన వ్యాధియైనను యౌషధసేవ లేకనే నివారణ మగును.'

'ఆమె పేరు చెప్పినదా?'

'లలితయట.'

దత్తు యాలోచనా పరవశు డయ్యెను, రాకుమారి పేరు మృణాలిగాని లలిత గాదు. ఆమె పరిచారికలలో నెవ్వరైన లలిత యున్నదేమో యని యాతఁ డూహింపసాగెను, కాని రాజసౌధమున నెచ్చటను లలితనామము గల స్త్రీ యున్నట్లాతఁడు వినియుండలేదు.

'భిషగ్వరా! ఆమె యింకను యేమయిన నుడివినదా?'

'నీవు యాతరుణి యజమానురాలితో నేమియో మాటలాడు చున్నట్లును, ఆయజమానురాలు నీయెదుటనే యామెకు ధనమొసంగి నాకడ కంపినట్లును చెప్పెను''

ఆతనిసందేహము తీరిపోయెను. రాకుమారియే కొంతధన మొసంగి తనపరిచారికను పంపియుండు నని నిశ్చయించుకొనియెను. 'అయ్యా! వెర్రివానివలె ప్రశ్నించు చుంటినని తలంపకుడు. మీరు నుడివిన దొక్కటియు నే నెరుంగను. అందుచే నింతవిపులముగ నడుగవలసి యున్నది. ఆమె యజమానురాలి పే రడిగితిరా?' యని ప్రశ్నించెను.

'అడిగితిని. కాని యామె పేరు తెలుపక మూయబడిన యొక కవరు నొసంగెను. దానిని నీవు దక్క యితరులు చూడరాదని దెలిపెను. ఆమె నూరురూపాయల నొసంగి మీతల్లికిఁ గావలసిన యౌషధము లన్నియుఁ గొని మిగిలినద్రవ్యము నా కడనే యుంచు మనియె. ఆధనమునఁ బదిరూపాయిలు మాత్రమే వెచ్చించితి. మిగిలిన దంతయు నాకడనే యున్నది. అని పలుకుచు యావైద్యుఁడు తనచొక్కా జేబు నుండి యొకకవరు దీసి యాతని కొసంగెను.

దత్తాకవరును తెరచెను. అందు పెద్ద యక్షరములతో కొరడారాణి యని వ్రాయబడిన కాగిత మున్నది. ఆపే రాతని కాశ్చర్యము కలిగించెను. ఆవీరనారి యాతనియెడ నంతదయారసమును చూపుటకు హేతువేమి? ఇదికూడ ముందుముం దామె యాతని కొనర్పసంకల్పించుకొనిన మహాద్రోహమునకు దారియా? దత్తున కేమియుం దోచలేదు. వైద్యు డాతనికడ సెలవు గైకొని వెడలిపోయిన పిదపకూడ దత్తు దీర్ఘాలోచనానిమగ్నుఁడై యట్లే కూర్చుండిపోయెను.



# అయిదవ ప్రకరణము.



పాఠకులారా! మన మొకవరి రాకుమారిని దర్శింతమా! ఏమి? ఏమను చుంటిరి? ఇంతకాలమైన నొకపరియైన యామెదర్శనము మీా కొసంగ లేదనుచున్నారా? కోప గింపకుఁడు. పితృవియోగ దుఃఖమున విచారాక్రాంతయై యున్న యామెను గాంచినమాత్రమున మీా కానందమెట్లు చేకూరును! చూడుఁడు. ఇప్పు డామె నవీన శోభాయుతయై యారామ మధ్యస్థతల్ప వేదికపై గూరుచుండి వీణియ చేతబూని యాతంత్రీస్వరంబున నామె కోమల కంఠస్వరంబును మేళగించి శృంగార గీతములఁ బాడుచుండెను. ఆసమయమునం దామెను గాంచినఁ బ్రత్యక్షముగ గాంచకపోయినను గ్రంధములందు వర్ణింపబడిన సరస్వతి స్ఫురణకు వచ్చుచుండెను. ఆమెను గాంచిన జడదారులు, జితేంద్రియులు నగు మానులుగూడ మరుబారికిం గురిగాక మానరు. చదువరులారా! ఇట్టిచక్కని దృశ్యము దిలకించుసమయ మదుదెంచునని యెరుగుటచేత నే మాలేఖని యింతవర కామృణాలి పేరయిన నెన్నడును వ్రాసియుండ లేదు. మృణాలి పచ్చనిశరీరచ్ఛాయ గలది. ఆమెవయసు పదునారు వత్సరములు. సర్వాంగసుందరి. ఆమె కూరుచున్న వేదికప్రక్కనే యామె చెలు లిరువురు పూలను గోయుచుండిరి. ఆయుద్యానవనము చుట్టును ప్రాకార మున్నది. ఆప్రాకారమున కుత్తరదిశను రాజసౌధము ప్రాక్పశ్చిమదిశల రాజోద్యోగుల గృహములును, దక్షిణదిశను, రాజబాటయు గలవు.

మృణాలి యావీణ గైకొని చాలసేపు శృంగారముగా పాడెను. సాయంకాల మయిదుగంట లయ్యెను మృణాలి పాటనాపుచేసి 'కమలా

పూలుగోయుట యింకను కాలేదా? సుర్యాస్తమయము గావచ్చినది. ఇంకను నడలెప్పుడు గుచ్చెదరు?' అనెను.

'తొందరవలదు. నీప్రియుండగు దేవునకు మాలలు తయారగును లెమ్ము.'

'అదియే వలదని చెప్పితిని హాస్యమునకుం గూడ హాస్యుండవలెను.'

'పోనిమ్ము. నీకంతకోప మేల? ఎప్పుడో యొకసారి నీకోమల కరపల్లవంబులు నవమాలికాకుసుమముల నీనాథుని గళమున నలంకరింప వలసినదే గాదా?'

మృణాళి మాటలాడలేదు. చెలి సంభాషణ మామెకుం గోపము గల్గించెను గాబోలు పాఠకులారా! ఆమెకు కోపమేల రావలయును? ఆమె పెండ్లాడదా?

వారిట్లు సంభాషించుకొనుచుండ నాకస్మికముగ మంత్రి యంతఃపురంబు బ్రవేశించి 'రాజకుమారీ' యని పిలచెను. ఆపిలుపు విని నంతనే యామె చకితయై, 'అమాత్యశేఖరా! యిటు' అనెను. మంత్రి వచ్చి రాకుమారియాసనమున కెదుటనున్న వేరొకతిన్నెపై కూర్చుండెను.

'మంత్రీ! ఏమి క్షేమములు! వేళగానివేళ యిటు వచ్చితివేమి?'

'వేళకును కార్యమునకును సంబంధము లేదుకదా!'

'ఏదయిన నగత్యకార్య మున్నదా!'

'అగత్యకార్యమే మున్నది! నీవు నేడు సర్వాలంకృతవై కంఠస్వరమును వీణాస్వరంబున మేళగించి శృంగారగీతములు పాడుచుండుటయే గొప్పవిశేషము. నే డింత యానందమయవై యుండుటకుం గారణ మరయవచ్చునా?'

'ఆనందమా! నా కెట్లు గలుగును? నాతండ్రి చెరనుండ డిడి వడి సింహాసనాసీనుండైన దినముననే నా కానందము.'

'రాకుమారీ! అందువిషయమే చర్చింప వచ్చితిని. నిన్నటి దిన మున నొకజ్యోతిష్కుఁ డరుదెంచెను. అతనిని రాజుగారి విషయము బ్రశ్నింప నీకు వివాహమైనగాని రాజు విముక్తి నందలే డట.'

'ఎందుచేత?'

నీగ్రహబలిమి దోషమునే నా తండ్రు రాజ్యబ్రష్టుఁ డయ్యెను. నీవు సౌధము విడచి యత్రవారింటికి కరిగిన నాదోషము తగ్గిపోవును.'

'అటులనా! అయినచో నేనీక్షణముననే రాజసౌధము వీడి, యెందేని బోయెద. నాజనకుని సౌఖ్యముకన్న నాకుం గావలసిన దే మున్నది!'

'ఎచ్చటి కేగెదవు?'

'ఏయరణ్యములకో బోయెదను. ఆకస్మికముగ నాకు వివాహ మె ట్లగును?'

'వలదు. ఎచ్చటికును బోనలదు. నాయింటనుండుము. నాసర్వ స్వమునకు నధికారిణివిగమ్ము. నీజనకుని క్షేమమునకై కెంత యగత్యమో నీక్షేమముకూడ నాకంత ముఖ్యమే.

'అసంభవము. మంత్రీ నీనోటివెంట నేడు వింతమాటలు విను చుంటిని.'

'నీవింతరూపమే నన్నిట్టి వింతమాటల నాడించుచున్నది.' మోహనాంగీ! నీకడ దాపనేల? రెండు వత్సరములనుండి నీయసమాన రూప లావణ్యాదివిశేషములఁ గాంచి మోహాక్రాంతుడనై నాహృదయగ తాభిప్రాయమును నీజనకున కెరింగించితిని. అతఁడు కొలదికాలములో నాయభిమత మీడేర్చెదనని వాగ్దాన మొసంగెను. కాని యింత నిట్టి విపరీతము సంభవించినది.'

'దుష్టాత్ముడా! నాతండ్రి నన్ను నీ కిచ్చి పెండ్లిచేయ దలచెనా? కల్ల. నేను నమ్మను. ఒకవేళ నాతండ్రి యంగీకరించినను నేనుమాత్ర

ము నిన్ను పెండ్లాడను. ఇంక ముం దెన్న డిట్టి మాటలు నాకడ
పలుకకుము.

'ఏ? నేను కురూపినా? అధికారరహితుండనా? లేక పౌరుష
హీనుండనా?'

'కారణము తెలుపు మందునా. నాతండ్రి పుత్రసంతానహీను
డగుట నీవిశాలరాజ్యమునకు నేనే యధికారిణి. నీవు నాయాజ్ఞాబ
ద్ధుండవు కావలసినవాడవు గదా! యిట్టిచో నేను నిన్ను పెండ్లి చేసుకొని నీ
యాజ్ఞాబద్ధురాల నయ్యెదనా! ఇక రూపము విషయమునా? నీవు రూప
వంతుడవే కాని నీకు నేననుకూలసతినిగాను! పౌరుషవిషయమున చెప్ప
నవసరము లేదు. బందితయై నిలచిన కొరడారాణిని చెరయం దుంచలేక
పోయిన నీపౌరుషమెట్టిదో నీకేయెరుక!'

'రాకుమారీ! నీయిచ్చ వచ్చినట్లు ప్రేలుచుంటివి. ఇప్పు డీరాజ్య
మున కంతకును నేనే యధికారిని, ఈరాజ్యమునం గలవారందరును నా
యాజ్ఞను పాలింతురు. తలంచుకొన్నచో నిన్నిప్పుడే బంధింపగలను
జాగ్రత్త మంత్రి యనిన నీకంత నిరసనగా దోచుచున్నదా!'

'దుర్మార్గుడా! నీ వెవరియాజ్ఞ గైకొని నాయుద్యానవనమునం
బ్రవేశించితివి? కమలా! ఈదుర్మార్గుని బంధింప నాయాజ్ఞగా దెలిపి
సైన్యాధిపతి నిటకుం దోడ్కొనిరమ్ము.'

మంత్రి వికటముగా నవ్వసాగెను. 'రాకుమారీ! నీవెక్కడకో
పోయి పిలువవలయునుగాని నే నిచ్చటనుండియే పిలచెదచూడుము.'
అని యాతం డొకయీలవేసెను. ఆమరుక్షణముననే సైన్యాధిపతి కొం
దరు భటులతో యాస్థలమునం బ్రత్యక్షమయ్యెను. మంత్రి యాతని
గాంచి 'ఓయీ! వీరిరువురను నే తిరుగ నాజ్ఞాపించువరకును బంధించి
యుంచుము, జాగ్రత్త నా యాజ్ఞ లేనిదే వీరి కాహారమయిన నొసంగ
రాదు' అనెను. సేనాధిపతి కనుసన్నచే నాభటులు వా రిరువురను
బంధింప యత్నించిరి. తనపిత్రార్జితమైన రాజ్యమునందున్న వా రందరును
తనకు వైరులై నందుల కామె యాశ్చర్య మందెను. భటులు చుట్టు

ముట్టుటచే వా రేమియు చేయఁజాలక యొకకేక వైచిరి.

ఆశ్చర్యము. మృణాళి కేక వైచిన యుత్తరక్షణముననే నాయుధపాణియైన యొకయశ్వారోహి తనహయంబు నాప్రాకార మవలీల లంఘింపఁజేసి యాస్థానమున నిలచి, 'ఓదుర్మార్గులారా! అబలపై సాహసము చూపుచుంటిరా! నిలుండు! రాజు బంధితుఁడైనంతమాత్రమున రాజ్యమున ధర్మము నశించెనని తలంచితిరా? పవిత్ర రాణీరాజ్యమందలి ధర్మసంస్థాపకులు నిద్రించుచుండి రనుకొంటిరా? అని గర్జించుచు నాభటులమధ్యకరుదెంచెను. ఆతనిఁ గాంచినంత నామంత్రి ఓరీదత్తా, నీదుర్మార్గాచరణంబు లన్నిటిని చూచి సహించుచున్నాను మొన్న కొరడారాణిని నాకనులయెదుట నిలువఁబెట్టి నన్ను మోసగించితివి. ఆనాడే నిన్ను బంధింపనెంచితిని. రాజద్రోహీ! నిన్నిక నుపేక్షింప రాదు.' అని పలుకుచు కత్తి తీసెను, కోడనే యటనున్న భటు లందరును కత్తులు దూసి రమేశదత్తును తాకిరి.

శౌర్యనిధియైన రమేశదత్తు యించుకంతయు జంకక తనయశ్వవిద్యానైపుణ్యమువలన నశ్వమును విచిత్రగతుల నడిపించుచు వా జనసమూహము నుండి వేరుబడి నిలుచఁబడియున్న రాకుమారికడకరుదెంచెను. ఆత్మరక్షణమునకై పోరాటుపడుచున్న రాకుమారి తన్ను సమీపించిన యా రమేశదత్తును గాంచి హర్షపూరితయై యాసమీపముననే యున్న తిన్నెపై కెక్కెను. ఆమె యా తిన్నెపై కెక్కుటలో యామె యభిప్రాయమును గ్రహించి దత్తు తన హయమును తిన్నె ప్రక్కకు బోనిచ్చెను రాకుమారి రయంబున హయమునెక్కి, దత్తూ! ప్రాణరక్షణము ముఖ్యము అనెను. ఆతడు వెంటనే యాతని హయమును ప్రాకారముదాటించి క్షణములోన నదృశ్యమయ్యెను

మంత్రి యాజ్ఞపై నారక్షకభటు లందరును గూడ హయారూఢులయి మృణాళిరమేశదత్తులు బంధించుటకై వెంటనంటిరి.

---

# ఆరవ ప్రకరణము.



పాఠకులారా! మనమొకపరి రాజేంద్రుని చూచివత్తము. వార
ణాసీనగర మాకాలమున గాంగానది కొకవైపునమాత్రమే యున్నది
రెండవతీరమున మహారణ్యముండెడిది. ఆయరణ్యము భీకరమృగసంకు
లము. అందు దిగంబరులను మోటువారనగు ననాదివాసులుండెడివా
రు. వారు నాగరికత యేమియో యెరుగనివారు. ఎవరికైన మాట
యొసంగినచో తత్ప్రతిజ్ఞాపాలనము కొఱకు వారు ప్రాణములనైన న
ర్పింప వెనుదీయరు. వారందరకును నాయకుఁడు వీరమల్లు. ఆవీరమల్లు
మాత్రము వారందరివలె దిగంబరుఁడు గాక యించుకనాగరికతగలవానివలె
కన్పడుచుండెను. ఆతనిఁ జూడ విద్యాధికుఁడనియు, కారణాంతరములచే
నట్లు ప్రచ్ఛన్నవేషధారియై యున్నాఁడనుకొని తోచకమానదు. ఆమోటుజాతి
వారందఱును యాయరణ్యమునందుగల యొకకొండలోయలో నివసించు
చుండిరి. ఆలోయ లోపల కూడ చాలవెలుతురుగనుండెను. ఆలోయ
యందు త్రాళ్ళచే నొక రాతికిఁ గట్టఁబడి వారణాసీనగరాధీశుఁడు బం
ధింపఁబడి విచారాక్రాంతుఁడై యుండెను. ఆతనిగంభీరవదనము నేఁడు
విచారభూయిష్ఠమై యుండెను. శరీరము నిద్రాహారపానీయలోపము
వలన కృశించియుండెను.

'అక్కటా! కాలగతి యెట్లు పరిణమించినది. సర్వంసహా
భూచక్రమును నిరంకుశముగ పరిపాలించుచున్న నేను నేఁటి కొక దుర్మా
ర్గునిచే బంధితుఁడనైతినిగదా? ఇప్పటికి నే బంధింపఁబడి యారుమాస
ములు దాటిపోయెనుగదా! ఈయారుమాసములనుండియు నారాష్ట్రము
నందలి యొక్కరినైన కనులఁజూచి యెఱుంగను. ఎట్లుచూడగలను?

నే నిట నున్నట్లు వారి కెట్లు తెలియును? తెలిసినను నా కొరకు వారిటకు వత్తురా కిల్ల. నా క్షేమమునకై పరిశోధింపవలసిన బాధ్యత నా భార్యకును సంతానమునకును గలదు గాని యన్యుల కగునా? పుత్రసంతాన మున్నచో నాకొరకు వారు వెదకుట న్యాయము. భార్య యీవరకే మరణించెను. పుత్రసంతానము లేదు. అబలయగు కుమార్తె మ్రుగ్గాళి యేమిచేయఁగలదు? ఆమె వివాహితయైనచో భార్యను సంతోషపెట్టుటకై నాజామాతయైన నా క్షేమమునకై పాటుపడియుండునేమో గాని నాకిప్పు డట్టియదృష్టముకూడ లేదు. అహా! కర్మ యనుల్లంఘనీయము గదా! పోనిమ్ము. రాజ్యభ్రష్టుని గావించి యిటబంధించిన మహాత్ముఁడు నన్ను వధించినచో నా కీవిచారము లేకపోవునుగదా! అమాయకురాలు ప్రపంచజ్ఞానశూన్యయగు నాకుమార్తెకూడ యీ దుర్మార్గుని బారిని చిక్కి యెట్టియిక్కట్టు లనుభవించుచుండెనో కదా! ఇప్పట్టున నాకొరకు నే నేడ్చుటయేగాక నాతనయకొరకుగూడ నేను చింతింపవలసినవాఁడ నయితిని. దైవమా! నీహృదయ మెంత పాషాణమయినది? దయాస్వరూపుఁడవుగదా! లోకులందరును నీబిడ్డలే గదా! అట్టిచో నీబిడ్డలిట్లకొంద రిట్టి కష్టము లనుభవించుచుండ చూచుచు నూరకుండుట నీకు న్యాయమా! నా మొఱలు నీకు వినిపించుటలేదా? వినియు నిట్లుదాసీనభావ మూనితివా? నీవే యిట్లుపేక్షించిన నిక నాకు దిక్కెవ్వరు? ఎవ్వరి నాశ్రయింతును?" అని పరిపరివిధముల విలపించుచున్న రాజేంద్రుని యాదరించువారు లేకపోయిరి. ఆస్థలమున కెవ్వరును పోరు. దినమున కొక్కసారిమాత్ర మాయారణ్యమునంగల యనాగరికులగు మనుజులు రాజునకు పండ్లను ఫలమును నొసంగుటకు వచ్చుచుందురు. మగల మరునాటివఱకును మానవదర్శనమే యుండదు. ఆమోటువారయిన వచ్చి యాతనితో నించుకంతయు సంభాషింపరు.

ఆనాఁడు రాజిట్లు విచారించుచుండ కొంతసేపటి కామొరకుల

నాయకుఁడగు వీరమల్లుఁ గాంచి 'రాజా! నీచే ప్రతిదినమును పదిచెట్లు వంతున నరకించుచుండుమని మాప్రభువువారి యాజ్ఞయైనది యీ యరణ్యమంతయు భూమట్టము గావింపవలయునట' యనెను.

'అయ్యా! వనచరవల్లభా! ఏల నా కీకఠినశిక్ష. మీప్రభువు దయారహితుఁడై న నీవైన నించుక కనికరింపరాదా?'

'ఎట్లు కనికరింపఁగలను? ని శ్శిక్షయనుండి తప్పించుట నా తరము కాదు. మాప్రభువు సర్వాంతర్యామి.'

వలదు. నాకు విముక్తివలదు. కాని నీకరము నలంకరించుచున్న యీ గండ్రగొడ్డలితో నాతల నఱకుము. అదియే నేకోరునది.'

'అబ్బో! అందులకుకూడ మాప్రభువుగారి యాజ్ఞ కావలయును. ఇఁక నాతో ననవసరముగ ప్రసంగింపకుము. నేను పోవలెను. రేపటినుండి యడవి నఱకుటకు సంసిద్ధుఁడవుగమ్ము.'

అని పలుకుచు వీరమల్లు వెడలి పోయెను. రాజేంద్రునివిచారము మరింత ఎక్కువయ్యెను. 'దైవమా! తుదకు నాచే బానిసవృత్తికూడ చేయించుచుంటివా? ఆహా! నీలీల లత్యద్భుతములుగదా' అని తలంచుచు యాతఁడు నిద్రాముద్రితుఁ డయ్యెను. కాని యాతని కానిద్రయందుకూడ సుఖములేకపోయెను. కనులుమూసి నవెంటనే యాతనికి స్వప్నమునదుర్మార్గులచే బాధింపఁబడుచున్న కుమార్తె కన్పించెను. ఆమె యెలుగెత్తి రక్షణమునకై తన్ను పిలచుచున్నట్లు వినఁబడెను. ఆకఠినాత్ము లామె నొకచెట్టునకు గట్టి కొరడాలతో మోదుచున్నట్లు కాన్పించెను. నిద్రావస్థలో నభయంకర దృశ్యము గాంచి యాతఁడు భీతుఁడై యొకపెద్దకేక వైచెను. ఆకేక యాతని స్వప్న ప్రపంచముననే గాక నిజముగ బాహ్యప్రపంచమునంగూడ ప్రతిధ్వనించెను. అయ్యది జనపదమైనచో నాకేక కసంఖ్యాకులను జనులు మూగియుందురు. కాని యీ యరణ్యంబున నాతనికేక యెవ్వరికి వినఁబడును? ఎవ రాతని నోదార్తురు? అతఁ డాస్వప్నావస్థ ము నింగి యట్లు

న్ని కేకవైచెను.. వారింకను మృణాళిని గొట్టుచున్నట్లే యాతనికిఁ గోచరించుచుండెను. కొంతసేపటికి నొకవీరపురుషుడు హయారూఢుఁడై యాస్థలమునకు వచ్చెను. వానింగాంచి యంతదనుక రాకుమార్తెనుగొట్టుచున్న వారందరును పారిపోయిరి. ఆపురుషుడు రాకుమారి కట్లు విప్పి ప్రేమపూరితస్వరమున 'ప్రాణేశ్వరీ! మనకష్టములు గట్టెక్కినవి. నీజనకుని విడిపించుకొని వత్తము రమ్ము." అని పలుకుచు నామె కరమును గ్రహించి వారిరువురును దన్ను సమీపించిరట. తనబంధములఁ దొలంగించినంత రాజు వారిరువుర నాలింగన మొనరింపఁ బోవునంతలో నాకస్మికముగ నాతనికి మెలకువ గలిగెను. కనులు తెరచి చూచెను. ఎవ్వారును లేరు. తా నెప్పటియట్ల బంధింపఁబడియే యుండెను, 'అక్కటా! నాకుమార్తె యెట్లు బాధపడుచున్నదో? యామెను రక్షించిన యాపురుషవతంసుఁ డెవ్వరు? అక్కటా అట్టిశుభదినంబుల నే నీజన్మంబునం గాంచఁగలనా? కల్ల! నాకట్టి యదృష్ట మావిధాత యొసంగలేదు.' అని భావించుచు నాతఁడు మరల దుఃఖాక్రాంతు డయ్యెను.

ప్రపంచమున ప్రతిజీవియు నిట్లే సుఖదుఃఖంబుల సమముగ ననుభవింపవలయునుగదా!



# ఏడవ ప్రకరణము



వారణాసీపురంబున నొకసుప్రసిద్ధ వారాంగన కలదు. ఆమెపేరు కనకవల్లి. కనకవల్లి సర్వాంగసుందరియు, కపటప్రణయనటనాప్రవీణు రాలు నగుటచే నామె యనేకుల ధనవంతుల తనప్రణయవహ్నిని శల భములుగ నొనరించి విశేషధన మార్జించెను. కాని యిప్పటి కిరువది వత్సరములనుండి యామె తన్నగరామాత్యుని వశము గావించుకొని యాతనిం దనప్రణయవారాసిముంచి తేల్చుచుండెను. మంత్రియు నామె మోహమునకు గురియై యొకానొకసమయమునను నాత్మభార్యను గూడ ద్రోసిపుచ్చెను. ఆహా! వేశ్యాంగన లెంతకైన నెనుదీయరుగదా! మాన వుడు వేశ్యాలంపటుడై గృహారామక్షేత్రాదుల నావేశ్యయధీన మొ నర్చి దారాపుత్రాదుల ద్రోసిపైచి తుద కావేశ్యచేకూడ నిరసింపఁ బడి యధఃపతితుఁడగునుగదా!

పాప మెంతటి ధనవంతుఁడైనను మంత్రికిఁ గూడ వేశ్యాలంపట ఫలితము గోచరింపకపోలేదు. ఆనాడు మంత్రి యథాప్రకారము కనక వల్లియింటి కరుదెంచెను. కనకవల్లి యాతని కెదురుగా రాలేదు. నిరంతర మందస్మితవదనారవిందయై సావడియం దాసీనయై యుండెడి కనకవల్లి నా డటలేదు. నాలుగైదుమారులు పిలచికూడ యాతఁడు విఫల మనోరథుఁ డయ్యెను.

మంత్రి రయంబున నామెశయనాగారముఁ బ్రవేశించెను. పర్యం కముపై విచారాక్రాంతవదనయై కనకవల్లి పరుండి యుండెను. ఆమెను గాంచినంత నాతనిగుండె ఝల్లుమనెను. ఆకన్నీటి బిందువు లాతని కశ నిపాతములయ్యెను. అతఁడు మెల్లన నామెప్రక్క నాసీనుఁడై 'ప్రేయసీ! ఏమి నేఁడిట్లు చింతాక్రాంతవై యుంటివి?' యని ప్రశ్నించెను.

'ఏమియు లేదు. నా విచారమునకు నివారణోపాయము లేదు.'

'ఏమియు చేతు? నా రాజ్యమున నెవ్వరయిన నీయాజ్ఞను ధిక్కరించిరా?'

'నీరాజ్యమా? పట్టాభిషేకమయినదా?'

'నీకుఁ దెలియకుండగనే పట్టాభిషేక మెట్లగును?'

'ఏమో! ఇంక నాతో నేమిపనియున్నది? రాకుమారి నీయర్ధాంగి యగుచున్నదిక దా!

'అవును. కాని యొక్క విషయము. నేనామెనుఁ గామాతురుడనయి పెండ్లి గావించుకొనుట లేదు. యీరాజ్య మామెజనకుని దగుట నామెయే యధికారిణిగదా! అందుచే రాజ్యము స్వాధీనపఱచుకొనుట కామెను పెండ్లాడవలసి వచ్చుచున్నది.'

'రాజ్యమును స్వాధీనపఱచుకొనుటకు వేరుపాయమే లేదా?'

'ఏమున్నది?'

'రాకుమారిని చెరబట్టుట'

'అట్లొనర్చినచో భటులందరు నన్నెదిరింతురేమో!'

'ఎదిరింతురా? ఏల యీటక్కరిమాట! నా యుద్యానవనమున రాకుమారిని బంధింప నెంచిన నీయాజ్ఞ నెవ్వరు నిరాకరించిరి? ఇప్పుడు మాత్ర మెవ్వరు నీకెదురాడుదురు?'

'ఆమె జీవించియున్నంతవర కామె నాకు శత్రువేగదా.'

'అయిన మరియు మంచిది. ఒకక్షణములో నీనిశిత కరవాలధారల కాహుతి యొసర్పవచ్చును.'

'అక్కటా! ఎంతదారుణము! ఆకోమలాంగిని వధింపుమందువా?'

'తప్పేమి? నీకామె శత్రువేగదా. శత్రుసంహారము రాజధర్మము కాదా?'

'కావచ్చును కాని స్త్రీవధ పాపదాయకము.'

'అవును స్త్రీని పురుషుడు వధించినఁ బాపమే కలుగును. కాని స్త్రీ వధింపఁ బాపము లేదుగదా! కావున నామెను నాయధీన మొనర్పుము. నేనే సంహరించెదను.'

మంత్రి యాగ్రహచేతస్కుఁడయ్యెను. స్త్రీలెంత స్వార్థలాభకాంక్షులు. ప్రణయమువా లొసంగననుమతింపరుగదా! ఆస్వార్థలాభపరాయణత్వమే వారల నధోగతి పాలొనరించుచుండెను. కనకవల్లి దురాగతముఁ జూచి మంత్రి సహింపలేకపోయెను.

'ఓసీ! కనకవల్లీ! ఇప్పటి కిరువదివత్సరములనుండి నీప్రణయాసలమునకు గురియై నీచెప్పినచొప్పునఁ బ్రవర్తించితిని. నీమోహనాకారమును గాంచి భ్రమించి నిష్కారణముగ పుత్రవతియై యేతెంచిన యాత్మసతిని నిరసించుటయేగాక—నీతులఁ బోధింపవచ్చిన యాపెసహోదరుని యుష్ణరక్తధారల నాహృదయశాంతి నొనరించుకొంటిని. నీచురాలా! నేటివఱకును నీసౌందర్యమునకు ముగ్ధుఁడనై యంధుఁడనైతిని. కాని యిప్పుడు నాయంధత్వము నశించినది. ఇక నీయాటలు సాగవు. నాప్రవర్తన ..., నీ కిష్టము లేకున్న నీధనద్రవ్యాదులతో సందేహింపక పొమ్ము. వారవనితవు. నీకుం బతులకు లోటు గలుగునా? అని గర్జించెను.

"ఓరీ దుర్మార్గుఁడా! నాయౌవనామృత మంతయు గ్రోలి యిపుడు వృద్ధురాల నయిన నన్నుఁ ద్రోసిపుచ్చ నెంచితివా? న్యాయాన్యాయములు పరికింపవలదా? నిన్ను నమ్మిన నన్నిట్లు నిరసించుట భావ్యమా?"

"నన్ను మోసగించి సౌభాగ్యపుత్రులతో వియోగము గలిగింపఁజేయుట నీకు న్యాయ మయినప్పుడు నిన్ను నే నిరసించుట మాత్ర మన్యాయ మెట్లగును? తాలి గట్టిన భార్య, సర్వవిధముల నా యైశ్వర్యమున కంతకు యధికారిణియైన యిల్లాలు నే పొమ్మనినంతనే మారుపలుకక పసిపాపనితో వెడలిపోయెను. ఆమె విచారక్రాంతయై

తనవిధిని నిందించుకొనుచు వెడలిపోవుట నీకు నేత్రానందకర మయ్యెనా గదా! ఇప్పుడు నీ విలువీడ నలసివచ్చినప్పుడు నీకు సంతాపము కలిగించుచున్నదా? ఇట్టి నీచురాలవు నిను స్వేచ్ఛగ వదలిన నెంతటిదారుణకార్యముల కైన నొడిగట్టుదువు. నిన్ను బంధించుటయే శ్రేయస్కరము. పండువంటి నాసంసారమును భగ్న మొనరించిన నీ కీపాటిశిక్ష యొసంగక తప్పదు."

కనకవల్లి యదరిపడెను. ఆమెనేత్రము లరుణకాంతుల బూనెను క్రోలుపులివలె నామె హుంకరించుచు యట్లే పగిండియుండెను. యమభటులకయిన వెరపని యా సచివుం డామె గంభీరవదనము గాంచి చలించునా! కనుసన్న మెలంగుచున్న భటులాయుత్తర క్షణముననే యామెను బంధించిరి.



# ఎనిమిదవ ప్రకరణము.



పాఠకులారా! నాఁడు రాకుమారితో హాస్యారూఢుఁడై వెడలి పోయిన దత్తు రాకుమారిని రాజసౌధమున విడచి యిలు సేరెను. తాను కొరడాదారుని బంధింపసాగినప్పుడు రాణి మంత్రి ప్రభుద్రోహి యని పలికినపలుకులు యథార్థమై యుండునని యాతఁ డిప్పుడు తెలిసికొనెను. అయిన మంత్రియే రాజేంద్రునిఁ బంధించియుండునా? కావచ్చును? రాజ్య కాంక్ష యెట్టి ఘాతుక కార్యములనయిన నొనరింపఁ జేయునుగదా! రమేశదత్తు యాలోచనాపరవశుఁ డయ్యెను. మంత్రియే యీదుర్మార్గములకన్నిటికిని గారణ మయినచో నాతని వెంటనే యే బంధింపరాదు? దత్తాప్రశ్నకు మరల తనలో తానే యిట్లు ప్రత్యుత్తర మొసంగికొనెను. మంత్రిని బంధించిన రాజేంద్రుని యునికి తెలియుట కష్టము. కావున రాజు కనబడువరకును మంత్రిని బంధింపరాదని నిశ్చయించుకొనెను. రా జెచ్చట నుండెనో తెలిసికొనుట యాతని విధి యయ్యెను. అతఁ డట్లాలోచనాపరవశుఁడై యుండ నొకయువకుఁ డాతని గృహద్వారము సమీపించి యాతనిం బిలచెను. దత్తు వెంటనే వీధితలుపు తెరచెను. ఎదుట నిలువఁబడిన వ్యక్తిని తానిదివరలో నొకటిరెండు పర్యాయములు చూచియుండెను. కాని యాతఁ డెవ్వఁడైనదియు పోల్చుకొనఁజాలక పోయెను. ఆపురుషుఁడు 'ఏమండీ! రమేశదత్తుగారు మీరేనా?' యనెను.

'అవును. నేనే. నీ వెవరవు? నాతో నేమి పని యున్నది?'

'నేనొక భిక్షుకుడను. రాజసౌధము నుండి వచ్చుచున్న

నొకపరిచారిక వడివడిగ నన్ను సమీపించి యొకయుత్తర మొసంగి మీ కిమ్మనెను. ఇదిగో యుత్తరము'

దత్తాయుత్తరము నందికొనెను. అది రాకుమారిచే వ్రాయబడియుండునని యాతఁడు తలంచెను. ఆభిక్షున కొకయణా నొసంగెను. భిక్షుఁడు సంతోషముతో వెడలిపోయెను. దత్తు వీధితలుపును లోన బంధించి సావడిలో నున్న కుర్చీపయి కూర్చుండి యాకాగితముమడతలు విప్పెను ఆతఁ డాశ్చర్యనిమగ్నుఁడయ్యెను. తా దలచినట్లులేక రాకుమారిచే వ్రాయబడలేదు. లేఖక్రింద 'కొరడారాణి'యని వ్రాయబడి యుండెను. ఆతని యాశ్చర్య మాలోచనగా మారిపోయెను. నిజముగ నయ్యది కొరడారాణిచే వ్రాయఁబడెనా? లేక తన్ను వంచింప మంత్రి యాతీరున వ్రాసియుండునా? దత్తాయుత్తరము నిట్లు చదివెను

'రమేశదత్తూ!

రాకుమారి క్షేమముగ నున్నది. ఆమెక్షేమమునకై నీ వేమియు నాందోళన మొందవలదు. బంధితుఁడైన రాజేంద్రుని విడిపించుటయే కర్తవ్యము. నీతో గొన్ని విషయములు తెలుపవలసియున్నది. నగర మావలనున్న నానివాసమునకు రమ్ము.

కొరడారాణి.

'ఈయుత్తరమునందలి విషయములు యథార్థములై యుండునా? అవును నేనున్న నా మెనివాసమున కేల రమ్మనును. ఇతరుల కా స్థలము తెలియదుకదా' అని నిశ్చయించుకొని యాతఁడు ప్రయాణోన్ముఖుఁ డయ్యెను. హయారూఢుఁడై యామరుక్షణంబుననే యాతఁ డిలువీడి యచిరకాలములో కొరడారాణి నివాసస్థలము చేరెను. ఆరాణి యాతనికొర కెదురు చూచుచుండెను దత్తాలమును చేరినంతనే యామె మందస్మితవదనయై యెదురేగి ,దత్తూ! వచ్చితివా? పగదానిగ భావించి రా వేమో యని తలంచితిని రమ్ము. అని పలికెను.'

'పగతురైనను వెరచువాఁడను గాను. భయమనునది నాకీ జన్మమున లేదు.' అని పలుకుచు నాతఁడు గుఱ్ఱము దిగి యామెను వెంబడించెను. వా రిరువు రొకపాకలో బ్రవేశించిరి. అందుండి లోనికి మెట్లున్నవి. ఆమెట్లగుండా వారు లోనికి దిగి యొకసుందరమైన గది యందు ప్రవేశించిరి. దత్తాశ్చర్యమందెను. అవి సామాన్యమయిన పాక లనుకొనెనుకాని వానిక్రింద నంతటి రహస్యమందిరములు గలవని తలంపలేదు. భూగృహము. దేశసేవాపరాయణులకుగూడనిట్టిమందిరము లుండవలయునా? అవును లేకున్న నెట్లు?

రాణి యాతని నాగదియందున్న పర్యంకముపై కూర్చుండజేసె ను. తాను కూడ నొక యాసనముపై కూర్చుండి 'దత్తూ! నాపలుకు లందు నీకు విశ్వాస మున్నదా?' యనెను.

'లే కేమి? విశ్వాస ముండుటచేతనే నీయుత్తరము చూచి వెం టనే బయలుదేరి వచ్చితిని.'

'నీతో గొన్ని ముఖ్యవిషయము లెరింగింపవలయుననిపిలిపించితిని.

'ఏ మావిషయములు?'

'ఇప్పటికి సుమా రిరువదివత్సరములక్రిందట—నన గా మన మిరు పురమునుగూడ పుట్టకముందు—జరిగిన గాధయొకటి తెలిసికొంటిని. అయ్యది యథార్థ మయినదికూడ నాకు నమ్మక మున్నది కాని నీవా విషయము ను నమ్మెదువో లేదో!'

'తప్పక నమ్మెదను'

'ఇరువదివత్సరములక్రిందట మంత్రి కనకవల్లి యనువేశ్య సౌం దర్యమునకు ముగ్ధుఁడై యామెను చేపట్టెనట. ఒకసంవత్సరము గడచిన పిదప పుట్టింటనుండి యప్పటి కారుమాసముల ప్రాయముగల కుమా రునితో నేతెంచిన భార్యను నిరసించి తరుమగొట్టుటయే గాక యామె ను దీసికొనివచ్చిన యామె సోదరునిగూడ వధించెనట. అప్పటినుండి

యు నాతఁడు వేశ్యాలోలుఁడై చరించుచుండెను. ఈవిషయము నేటి వరకును మంత్రికిని యావేశ్యకును దక్క యన్యు లెవ్వరికినిఁ దెలి యదు. పాప మాతని భార్యయు కుమారుఁడును నేమయిరో కూలి తెలియదు. ఇప్పుడు మంత్రి రాకుమారియెడ మోహాక్రాంతుఁడయి వలదని వారించుచున్న యాకనకవల్లినిగూడ బంధించెను. సాయంకాల మామె నెక్కడకో తీసికొనిపోయి బంధింపవలసి.. దని మంత్రి తనభటు ల కాజ్ఞాపించెను. వారందుల కంగీకరించిరి'

'ఈవిషయము లన్నియు నీకెట్లు తెలిసినవి?"

'నిన్నటిదినమున మంత్రి భవనమున మంత్రియు కనకవల్లియు సంభాషించుకొనుచుండ వినియుంటిని'

'అప్పుడు నీ వచ్చటనే యుంటివి గదా? మంత్రి నేల బంధింప లేదు.'

'వీలు లేకపోయినది. నే నాసమయమున నటయుంటు టెవ్వ రు లెరుంగరానిది.'

'సరే కాని యిప్పుడు కర్తవ్యమేమి?'

'సాయంకాలము నీవు వారిని వెంబడించి కనకవల్లి నెచట బంధింతురో చూచిరావలెను'

'అవసరము?'

'ఆసమీపముననే రాజుకూడ బంధింపఁబడి యుండవచ్చును'

'అయిన రాజునుకూడ నీతఁడే బంధించె ననుదువా?'

'ఏమీ! ఆవిషయమున నే నిప్పు డేమియు దెలుపఁజాలను కాని యారహస్యస్థలముమాత్రము తెలసికొనుట మంచిదని నాకుఁ దోచుచున్నది'

'అటులే చేసెదను. రాకుమారి—'

'క్షేమముగ నున్నది. దత్తూ! రాకుమారివిషయమై నీకింత శ్రద్ధ యేల? యామెను మోహించితివా?' అని పలుకుచు నామె మందస్మిత యయ్యెను.

'తరుణీ! ప్రేమించుటయా! ఆమె నీడనుముట్టుట కయిన నా కధికారము లేదు అట్టిచో నామె నెట్లు చేపట్టగలను.'

'పెండ్లాడుటకును మోహించుటకు భేదము లేదా? భ్రాంతి కందరకును యధికార మున్నదికదా!'

'నిష్ఫల భ్రాంతివలన నేమి లాభము?'

'అట్లుకాదు. నీవు నిజముగ నామెను ప్రేమించినచో నామె నంగీకరింపఁ జేయు భారము నాది.'

'వలదు వలదు. నా కామెపై గలప్రేమ నాతో నసించవలసినదే. అందు నాకు సఫలత చేకూరుట కల్ల. నా కావిషయమున విచారము కూడ లేదు. అశాశ్వతమగు ప్రేమకన్న శాశ్వతమగు ప్రభుసేవ నాకిప్పుడు ముఖ్యము. నాయీప్రయత్నమున విజయమొందువరకును ప్రేమకు నాహృదయమునఁ దావులభింపదు. ప్రస్తుతము నాహృదయమంతయు రౌద్రరసముతో నిండియుండుట చే శృంగారమునకు తావు లేదు.

'పోనిమ్ము. ఆరౌద్రమంతరించినపిదప నాస్థానమున ప్రణయ మాక్రమించు ననుకొందును'

'కావచ్చును. ఇప్పు డావిషయ మెందులకు? దైవసంకల్పమెట్లున్న నట్లు కాకపోదు. కాని నీవేల నాదుర్మార్గులను వెంబడింపరాదు?'

'నాకింకను యగత్యకార్యము లున్నవి.'

'సరే! నేనికపోవచ్చునా!'

'వెళ్ళవచ్చును. కాని రాకుమారిని పెండ్లాడు విషయమేమి నిశ్చయించితివి?'

‘ఆవిషయమును నీ వేమియుం ప్రశ్నింపఁగాదు’ అనిపల్కుచు దత్తు లేచెను. రాణి కూడ తన యాసనముడిగ్గి యాతనిని కొంతదూరము వరకు వెంబడించెను. పిదప నాతనికడ సెలవంది తిరుగ తనపాకలో ప్రవేశించెను.

దత్తు హయారూఢుడై యింటికిమరలెను. ఆతనిహృదయ మాలోచనానిమగ్న మయ్యెను. రాకుమారివిషయమున నీరాణియింతగ చెప్పుట కేమి కారణము? రాకుమారి నిజముగ నన్ను ప్రేమించి యుండెనా? నాకట్టి యదృష్ట మబ్బునా? కల్ల. నాహృదయ మెరుంగగోరి యీమె యిట్లు ప్రశ్నించుచుండెనేగాని రాకుమారియెక్కడ నేనెక్కడ? ఆమె నన్నుఁ బెండ్లాడునా?’ అని యాలోచించుచు నాతఁడు మెల్లన నిలుచేరెను.



# తొమ్మిదవ ప్రకరణము



సాయంకాలము మూఁడుగంటలకే యాతఁడు ప్రచ్ఛన్నవేషమున మంత్రిసౌధమునం బ్రవేశించెను. అచట నున్నభటులు దత్తునుగాంచి యాతనివేషమును బట్టి యాతఁడుకూడ నొకభటుఁడే యని తలంచి యూరకుండిరి. అందుచే దత్తు భవనమంతయుఁ దిరుగాడఁసాగెను. ఎచ్చటను యాతని కేమియు విశేషము గాన్పింపలేదు. ఆభవనమునందలి శయనాగారముఁ బ్రవేశించెను. అచటకూడ నెవ్వరునులేరు. గోడకు చిత్తరువులు చాల వ్రేలాడుచుండెను. అందు రాకుమారిచిత్రపటముకూడ నున్నది. దత్తాశ్చర్యమంది యాచిత్రపటమును గయికొని తనవస్త్రాభ్యంతరమున మరుగుపరచుకొనెను. ఇంతలో నాతనికిఁ బదధ్వని వినవచ్చెను. ఆతఁ డొకపరి గదిగుమ్మముకడ కరుదెంచి చూచెను. కొందరు మనుజులు గదివైపునకే వచ్చుచుండుటగాంచెను. వారిలో మంత్రి కూడ నుండుటచే వారేమి సంభాషించుకొందురో వినవలయునని తలంచి యాతఁ డాగదియందలి మంచముక్రింద దూరి యొదిగియుండెను. మరికొంతసేపటికి మంత్రియు, మరియిరువురు మనుజులును గదియందు ప్రవేశించిరి. మంత్రి పర్యంకముపై కూరుచుండెను. ఆతనివెంటవచ్చిన యిరువురు మనుజులునుఁగూడ చెరియొక యాసనముమీఁదను కూర్చుండిరి పిదప నిట్లు ప్రసంగింపసాగిరి—

మంత్రి—సైన్యాధిపా! రాకుమారి నిజముగ నన్నుఁ బెండ్లాడ నంగీకరించినదా?

సేనా—సందేహమేమి? ఆమె స్వహస్తలిఖితమగు లేఖనుగూడ తిలకించితిరికదా! కాని—గడు వేల కోరెనో తెలియకున్నది.

మంత్రి—కారణమున్నది. కొందరు క్షత్రియకన్యలు వివాహితలు లగుటకు ముందు వీరసంతాన ప్రాప్తికై వ్రత మొనరింతురు. రాకుమారి యట్టివ్రతమును బూనుటచే యారువారములు గడువు కోరి యుండెను.

సేనా—వ్రత మొక్కనమేగదా జరుగవలయును? దాని కారువారము లేల?

మంత్రి—కాదు—కాదు. నీకుఁ దెలియదు. ఆరువారము లనిన నత్యల్పకాలము. కొందఱ వ్రతము లారుపక్షములు, యారుమాసములు వరకు గూడ నుండును.

సేనా—ప్రభూ! కనకవల్లి నేమి చేయఁ దలంచితిరి?

మంత్రి—గంగానదియావలితటంబునఁ గల బాయలోవిడువుమని యాజ్ఞాపించితిని

సేనా—సెబాసు. చక్కని శిక్ష. ఎవరు తోడ్కొనిపోదురు?

మంత్రి—నీవు గొనిపొమ్ము.

సేనా—చిత్తము.

మంత్రి యాకస్మికముగ ప్రక్కనున్న గోడవైపు చూచెను. ఆగోడ కాతని ప్రథమభార్యయొక్కయు కనకవల్లియొక్కయు, రాకుమారియొక్కయు చిత్రపటములు వరుసగ వ్రేలగట్టియుంచెను. అందలి కనకవల్లిచిత్రపుగూడ తనసౌధమునుండి తొలఁగింపవలెనని యాతని యూహ! కాని యాతఁ డాకుడ్యమును తిలకించినంతనే యాశ్చర్యమందెను. అచట రాకుమారి చిత్రపు లేదు. ఆతఁ డాశ్రమునకో గది నాలుగుమూలలను పరికించెను. ఎవ్వరును గాన్పింపలేదు. వడివడిగ నా గది వదలెను. ఆతనివెనువెంటనే సేనాపతియు రెండవయువకుడును గూడ వెడలిరి. వారు మువ్వురును మంత్రిగారి రహస్యాలోచనా మందిరమును బ్రవేశించిరి. ఆయువకాశమును పురస్కరించుకొని యంతదనుక

మంచముక్రింద దాగియున్న రమేశదత్తు గూనలకు వచ్చి నడివడిగ నాభవనము వదలి రాజమార్గమునఁ బ్రవేశించెను

మంత్రి రహస్యమందిరమునఁ గూడ వెదకెను. అచటకూడ నాతనికి రాకుమారి చిత్తరువు గాన్పింపలేదు. కోపముతో నాతడు సేనాపతిని దిలకించి, 'ఓయీ! నాశయనాగారమున నుంచబడిన రాకుమారి చిత్రపట మెవ్వరిచేతనో తస్కరింపఁబడియెను. నాసౌధమున మనభటులుదక్క యన్యు లెవ్వరును బ్రవేశింపఁజాలరు. నా సేవకుల దీసి. వో శిక్షణ మొసంగవలయునని యాజ్ఞాపింపుము' అనెను. అంతుల నాసేనాపతి చిరునవ్వుతో 'ప్రభూ! వనిత మీయందున్న గూఢానురాగ చిత్తవృత్తికై యింత యారాట మేల? ప్రియురాలు దూరమున నున్నచో నామెను తలచుచు దర్శించుటకై చిత్తరువుల నుంచుకొందురు. మీరిప్పుడు వచ్చినప్పుడెల్ల రాకుమారిని చూడవచ్చునుగదా! అది యటుండనిండు. మీకు స్వామిసార్థ మెల్లా గడపినచో రాకుమారి నిరంతరము మీ నేత్రముల యెదుటనే మెలగును' అని పలుకుచు నాతనిని శాంతింపఁజేసెను. తేపన్న నాపటాపహారిని బట్టుట నారితరమా!

మంత్రి యించుకశాంతము బూని తిరుగ శయనాగారముఁ బ్రవేశించి యచటనున్న కనకవల్లిచిత్రము తీసి 'సేనాపతీ! యిదిగో నూపుంట చిత్రపటము. దీనిని నూతనముగ గంగాప్రవాహములో బారవేయుము.' అని పలికెను. సేనాపతి యాపటము గైకొని మంత్రియనుమతి బడసి వెడలిపోయెను.

పాఠకులారా! మంత్రిభవనము వదలిన రమేశదత్తు రాజమార్గమున నడుగిడినంతనే ప్రక్కనే యున్న రాజసౌధమున నిలువఁబడి చప్పట్లు గొట్టుచున్న రాకుమారి నాతఁడు గాంచెను. ఆమె యాతనినిఁ బైకిరమ్మని పిలుచుటచే నాతఁడు నడివడిగ నాసౌధమునం బ్రవేశించెను. రాకుమారి యాతనికి స్వాగత మొసంగి, ఆర్యా! మీరు వీరాగ్రేసరులు

గదా! చోరత్వ... ...మా! యని ప్రశ్నించెను. దత్తాశ్చర్య మందెను. తా నచరించిన చోరత్వ మే మున్నది? జనన మొందినదాది యంతవరకు రాకుమారి చిత్రపటమును దొంగిలించుట దక్క నే మేమి యు నెరుంగడు. అయినను తాను మంత్రిశయనాగారమునం దపహరించిన చిత్రపటవృత్తాంత మామె కెట్లు తెలియును? దత్తు హృదయము ను కుదురుపఱచుకొని. "రాకుమారీ! నే నేమి దొంగిలించుతిని? యనెను.

"ఏమియు దొంగిలింప లేదా?"

"ఏమి"

"నన్ను జెలువు మందువా?"

"చెప్పుము."

"మంత్రిప్రాణమును హరింప లేదా?"

దత్తు తెల్లబోయెను.

"ఏ మట్లు తెల్లబోయెదవు? మంత్రి ప్రాణాధిక్యపదార్థము ను హరింపలేదా?"

"నీపలుకు నా కర్థ మగుట లేదు."

"పోనిమ్ము నీవస్త్రాభ్యంతరమున నున్నపట మెవ్వరిది?"

దత్తు నిరుత్తరు డయ్యెను. తనదొంగతనము బయలుపడెనని తలంచెను. అది యొక కన్యది."

"అటులనా? నాకుం జూపవచ్చునా"

"సందేహ మేల? కానిచూపిన దాని నిమ్మని యడుగ నని బాస చేయుము"

"ఎందుచే నీయరాదు?"

"నా కాపటముతో పని యున్నది."

"ఆకన్యపట మామెనుం బెండ్లాడువానికడ గాని యుండరాదు."

దత్తు ప్రత్యుత్తర మొసంగలేదు. తన ప్రయత్న మంతయు భగ్న మయ్యెనని తలంచెను. తా నాపటముతో వెడలిపోయిన తా నాగారు మారిని ప్రేమించినట్లు వెల్లడియగును. అచట వదలివేయుటకు మనస్కరించుట లేదు. 'రాకుమారీ! ఇట్టివిషమావస్థలకు లోను గావించి నన్ను బాధించుట న్యాయమా?' అనెను.

'నీకంత కష్టముగా నున్నచో నా కీయవలదు. కాని చూపించుము. అదియే చాలును.'

దత్తు తనవస్త్రాభ్యంతరమునందున్న మృణాళి చిత్రపటము దీసి బల్లపై నుంచెను. ఇంతలో భవనద్వారమున మూడుగంటలు కొట్టబడెను.

'రాకుమారీ! నే నెంత మందమతినైతిని. అత్యగత్యకార్యమున నరుగవలసి యున్నది.' యని పలుకుచు నాపటము నచటనే విడచి రయంబున వెడలిపోయెను.

ఆతఁడు గంగాతీరము చేరునరికే బంధితయైన కనకవల్లి ఒకనావపై కూర్చుండఁబెట్టిరి. సేనాపతి నావ నెక్కుచుండెను. పడవవాఁడు రెండవవానికొఱకు వెదకుచు దత్తును సమీపించెను.'

'ఓయీ! నీవు తెడ్డు లాగగలవా?' అనెను.

'ఏమిచ్చెదవు?'

'ఒకరూపాయి. ఆమీఁద అయ్యగారి నేమయినా అడుక్కో...'

దత్తు అంగీకారసూచకముగ తల నూపెను. వారిని వెంబడించుటకు భగవానుఁడు తనకట్టి యవకాశము గల్గించి నందులకు సంతోషించి తెడ్డు లాగుచుండెను. అభ్యాసము లేక పోయినను యూహావలన నాతఁడు తెడ్డు లాగుచుండెను. అయ్యాది సంపూర్ణముగ మునిగి మునుగక పడుచుండుటచే నావ గమనముమాత్రము మందముగ నుండెను. నావతీరము వదలి పదియడుగుల దూరముమాత్రము పోయెను. ఒడ్డు

నున్న భటులు వెనుకకు మరలిరి. కనకవల్లి యంతదనుక నధోముఖియై కూర్చుండెను. అప్పుడు కొంచెము శిరముపై కెత్తి తనయెదుట మంద స్మితవదనారవిందుఁడై కూర్చుండి తనచిత్రపటమును పరీక్షించుచున్న సేనాపతిపై క్రీగంటి ప్రసారముల బ్రసరింపఁ జేయుచు, 'ఆర్యా! మీచే తియందలి పట మెవ్వరిది?' యనెను.

సేనాపతి మారు పలుకక యాపటమును ముద్దిడుకొని యా మె కందిచ్చెను. కనకవల్లి స్వీయపటమును గాంచి యాశ్చర్యమం దెను. ఏమీ! నాకష్టములు గట్టెక్కెనా?' యని భావించుచు నామె మరల నిట్లనియెను.

'సేనాపతీ! రాజ శిక్షకుఁ బాత్రురాలయిన యీకనకవల్లిని ప్రేమించినమాత్రమున మీ రేమి చేయఁగలరు?'

'రాజశిక్షయా? ఆశంక నరా జెట్టుకురు? రాజానుగ్రహము వడసి నిన్ను విడిపించెదను.'

'ఎన్నటికి?'

'అచిరకాలములోనే విడిపించెదను. నీయనుగ్రహమునకొఱ కెంతకాలమునుండియో పాటుపడుచుంటిని. నేటి ది సమకూరెను.'

'ఆర్యా! క్షమింపుడు. మంత్రి బాకునా కీసిపెండ్లాడు నటకాదా?'

'అసంభవము. రాజకుమార్తె యెన్న డాతని పెండ్లాడుట కంగీక రింపదు.'

'నన్నిప్పు డెచ్చట దిగవిడిచెదరు?'

'మంత్రి యాజ్ఞపరిహారమె గాదు. ఇప్పుడే గాదు. మా ప్రభు వర్యుని విడిపించువరకు యీ నిక నుండుము నే వత్తెదను. ఆతని ధిక్కరించినచో రాజేంద్రుని యాగడ తెలియు టసంభవము.'

వ ల్లి మాటలాడుచుండగనే నావ రెండవగట్టు చేరెను. వా రందరునుగూడ నావదిగిరి. సేనాపతి కనవకవల్లి బంధముల విప్పి

చేయూత నొసంగి గింపెను. వారినిశ్చలానురాగమునకు రమేశదత్తు సంతోషించెను. అంతవఱకు రాష్ట్రవాసులందరును వైరులని తలంచుచున్న రమేశదత్తున కొకహితుఁడు గలడను ధైర్యము తోఁచెను. అయినను యాతని సంపూర్ణముగ విశ్వసించు టెట్లు? కనకవల్లిపై నాతనికింగల మోహాతిరేకంబున నట్లు కపట వచనంబుల నాడఁగూడదా? కావచ్చును.

రమేశదత్తు నావ వానిఁ దిలకించి, 'తాతా! యిప్పుడే వచ్చెద నుండుము.' అని పలికి తానుగూడ నావ దిగి యాతని వెంబడించెను సేనాపతి యామె నొకకొండ గుహలోనికి గొనిపోయి యందు దిగవిడచెను. ఆతఁడీవలకు వచ్చుసరికి వీరమల్లుచటఁ బ్రత్యక్ష మయ్యెను. సేనాపతి యాతనిఁ గాంచి, 'ఓయీ! ఇదిగో మామ తిరిగారి యాజ్ఞాపత్రము.' అని పలుకుచు నొకయుత్తర మొసంగెను వీరమల్లు దానిని చదువుకొని 'మంచిది. నీవు పోవచ్చును' అని పలికి గుహలోనికి పోయెనును. సేనాపతి వెనుదిరిగి నావకడ కరిగెను అట రెండవనావికుఁడు లేకపోవుటచే నాతఁడు తిరిగివచ్చువఱకును సేనాపతియట వేచి యుండ వలసి వచ్చెను.

దత్తు వీరమల్లు ననుసరించి యాగుహలోని కరిగెను అందు పెద్దపెద్ద రాళ్ళు దక్క నతనికేమియు గానవచ్చుటలేదు. వీరమల్లు కనకవల్లినిగాంచి యాశ్చర్యమందెను. ఆమె రాకుమారియై యుండవలయునని తలంచెను. అయినను యామెతో సంభాషింపవలయునని యనుకొనెను. మెల్లన నామెను సమీపించి యాసమీపమున నున్నయొకరాతి తిన్నెపై కూర్చుండెను. 'తరుణీ! నీవెవ్వరవు? ఇట్లు బంధింపఁబడుటకు గారణమేమి?' యనెను.

'దయామయా! నాదురదృష్టమువలన బంధింపబడితిని. ధర్మప్రభుండగు వారణాసీరాజేంద్రుఁడే బంధింపబడినప్పుడు నా కిట్టియవస్థ గలుగుటయందాశ్చర్య మేమున్నది?'

'నీవా సకోశ్రుని తనయవా?'

'కాదు. నే నొకవేశ్యము. ఇంతవరకు మీయధికారి యగు మంత్రి నను జేరదీసెను. పురుషుల యనురాగములు చంచలలుగదా! ఇప్పు డాతడు రాకుమారిని పెండ్లాడ దలంచి నన్నిట్టియుద్యోగతికిం ద్రోసెను.

'చింతింపకుము. నీవు వేశ్యవగుటచే నీ కేమి లోపము? వేశ్యల కొకభర్తయను నియమములేదు గదా!'

'కావచ్చును. కాని యాదుర్మార్గుని నెత్తురుకండ్ల జూచువరకును నేను పురుషసంకల్పము వదలవలెనని ప్రతినం గావించితిని. నీకు నాయెడ ననురాగ మున్న నాయభిలాష దీర్పుము.'

'ఓసీ! నీచురాలా! ఏమంటివి? నాప్రభుని వధింపవలెనా?' నీదుస్థితిని విచారింపక యన్యుల నాశనము గోరుచుంటివా? సరే. అచిరకాలములో నీయసువుల బాపి నీవిచారము పోగొట్టెద లెమ్ము.' అని గిర్రున వెనుదిరిగి గుహ వదలెను. పాపము కనకవల్లి హతాశయయ్యెను. ఆసమీపముననే డాగి యీసంభాషణ మాలించుచున్న రమేశదత్తునకు కోపమును, యాయువతి దీనవదన గాంచిన విచారమును గూడగలిగెను. తానామె కించుక ధైర్యము గరుపకున్న నామె మరణించుట నిక్కువమని యాతడు నిశ్చయించుకొనెను. తోడనే యామె యెదుట కరుదెంచి 'కనకవల్లీ! నీ వేమియు దుఃఖింపకుము. నీవు కోరినట్లు మంత్రి యుష్ణరక్తమును నీకనులకు చూపించెదను. అట్లని నేను నిన్ను కామించితి నని తలంపకుము. నీవు నాకు మాతృతుల్యవు.' అనెను.

'ఆర్యా! మీదయారసమున కెంతయు సంతసించితిని దయయుంచి మీనామ మడుగవచ్చునా?'

'తప్పేమి? నన్ను రమేశద త్తందురు. నేను వారణాసీ పుర

‹మీ రిక్లేల వచ్చిరి!'

‹ఈవిషయ మెరింగి సమయము వచ్చినప్పుడు కారాగారము విడిపించుటకు వీలగునా? నీవున్న తావును చూడవలయునని యిటు వచ్చితిని.'

‹మీ యుపకారమున కెంతయు కృతజ్ఞురాలను.'

దత్తు డా సట నిట పరిశీలింపవలసిన దేదియు లేనందున నాగుహావీడి యీావల కరుదెంచెను. త్వరలో బోకున్న నావ వాడు తొందరపడునని తలంచి వడివడిగ నడచుచుండెను. కాని యాతనితొందర నాగలేదు. కొంతదూర మేగునంతలో యాయరణ్యమున వసించుచున్న దిగంబరులగు మోటుజాతివా రాతిని జేకొనిరి. వా రంద రొక్కసారి చుట్టిముట్టుటచే నాతం డేమియు చేయజాలకపోయెను. వా రాతని నొక వృక్షమునకు బంధించి యందొకడు తనునాయకుడగు వీరమల్లున కా వార్త నెరిగించిరి.

వీరమల్లు వచ్చి రమేశదత్తును గాంచి, ‹ఓరీ! నీ వెవ్వడవు? అనెను. ఆతనిం గాంచినంత రమేసుని యొడలు మండిపోయెను. కాని యాసమయమున నాతండు రోషము బూనినచో నటనుండి తప్పించుకొని పోవుట దుస్తర మనియు, ఉపాయము నుపాయముచే దప్పించుకొనుట మంచిదని తలంచెను. అందుచే నాతండు భయవినయములు గదుర, ‹బాబూ! నేను నావవాడను సేనాపతిగారితో వచ్చితిని. ఈవనమును చూడవలయునని వచ్చితిని. తిరుగ వెళ్ళుచుండ వీరు నన్ను బంధించిరి. బాబూ! నేను వెళ్ళువరకు అయ్యగారు రేవలనే యుందురు.' అనెను.

వీరమల్లాతండు నిజముగ నావవాడై యుండునా యని సందేహింపసాగెను. 'ఓయీ! నిన్ను విడిపించెదను, నీతో నావకడకు నన్ను కూడ గొనిపొమ్ము, నీవు చెప్పినది నిజమని సేనాపతి దెలిపినచో నిన్ను విడిచెదను. లేకున్న నీకు మరణము తప్పదు.' అనెను. రమేశదత్తుంను

ల కంగీకరించెను. తోడనే వీరమల్లు యాజ్ఞపై నాతనిబంధములు విప్పఁ బడెను. వీరమల్లు దత్తు లిద్దరును నావకడకువచ్చిరి. దత్తు చెప్పినట్లు సేనాపతి యటనే యుండెను. ఆతఁడు దత్తునుగాంచి 'ఏమిరా! ఎచ్చట కరిగితివి?' అనెను.

దత్తు భయవినయంబులు ముప్పిరిగొన 'బాబూ! అడవిచూడ నరుగునంత నీయడవిమనుజు లరుదెంచి నన్ను బంధించిరి. ఎంతచెప్పినను నాపలుకుల విశ్వసింపక చాలసేపటి కీదయామయుని దోడితెచ్చిరి. వీరికి నాసంగతి దెలుప నిప్పుడు విడిపించి యిటకుఁ గొనివచ్చిరి. ఆలస్యమున కిదికారణము' అని పలుకుచు నాతఁడు రయంబున నావనెక్కెను. వీరమల్లేమియు మాటాడలేక సేనాపతి కభివాద మొనరించి వెనుదిరిగెను. సేనాపతి నావనెక్కినంత రమేశదత్తు తెడ్డులాగుట ప్రారంభించెను. నావ తీరమువదలి యావలియొడ్డు చేరెను. నావవాడు దత్తున కొసంగెదనన్న రూకనొసంగెను. కాని దత్తునకారూక గానలయునా? వారందరును చూచుచుండగనే యాతఁడారూక నొకభిక్షుకున కొసంగి వెడలిపోయెను. ఆతని యాకృత్యము సేనాపతికిని నావవానికినిగూడ యాశ్చర్యము కలిగించెను.



# పదియవ ప్రకరణము.



'ఆహా! ఏమి యీరమేశదత్తు రూపలావణ్యములు. ఆతనిసాహ సము, పరాక్రమములుగూడ యద్వితీయము! దైవమా! అట్టిరూప పౌరుషవిరాజితుని యేరాజవంశమునందే నమితభోగభాగ్యములమధ్య బుట్టింపక యిట్లు గర్భదరిద్రునిగ నేల బుట్టించితివి. అట్లయినచో నీసరి కెందరో రాజేంద్రులు తమకన్యల నాతనిపాదములపై బడవైచి వివాహ మాడుమని బ్రతిమాలుచుందురుగదా! నానాటికి నా కాతని యెడ గలమోహ మగ్గలమై నన్ను విరహవేదనాపీడితను గావించుచుండెను. ఈవిరహము భరించుట దుర్లభము. పెండ్లాడుద మనుకొనిన జననిందకుం బాలు గావలసివచ్చునేమో! నా కేమియుం దోచకున్నది. ఇంతకు నాతఁడు నాయెడ నెట్టిభావముతో నుండెనో తెలియకున్నది. ఎంత యత్నింతు మనుకొన్నను నాప్రియత్నము లన్నియు విఫలము లగుచున్నవి. ఆతని కొక లేఖ వ్రాయుదునా? ఆతఁ డేమనుకొనునో? అయ్యది తప్పుగా భావించునేమో! దైవమా నన్నెట్టివిషమపరీక్షకులోను గావించితివి' అని పలవించుచు మృణాళి తనశయనాగారమునఁ గూర్చుండి యుండెను. ఆమె కరమున నాఁడు రమేశదత్తుచే విడువఁబడిన తనచిత్రపట మున్నది. ఆనేత్రములు చలింపక యాచిత్రరవును దిలకించుచున్నవి. ఆమె కేలనో యాచిత్రరవున నూతనశోభ యున్నట్లు తోచెను. ఆమె శోడనే గదిగుమ్మమునఁ గెమఁ గనున్న నిలువుటద్దముకడ కరిగి తనప్రతిబింబమును యాచిత్రపటముతో సరిపోల్చుచుండెను. ఆమె యాచిత్రకారుని ప్రవీణత కాశ్చర్య మందెను. 'ఆహా! చిత్రలేఖన మెంత గొప్పది? ఇది సృష్టికిం బ్రతిసృష్టిగదా! నిజముగ చిత్రలేఖ

నితఁడు విధాతృతుల్యుఁడు. ప్రజానీకుఁడు.' అని తలంచుచుండెను. అచ్ఛముగ తనరూపమే యాచిత్రపటమున నున్నందునఁ గామె యాశ్చర్య మందసాగెను. ఆమె యట్లు తనప్రతిబింబమును చిత్రముతో పోల్చుచు పదినిముసములు గడపెను. ఆచిత్తరవు దత్తునాకర్షించుటచే తానుకూడ నట్టిరూపమునే ధరించినచో దత్తు యనురాగమునకుఁ బాత్రురాలగునదు నేమోయని తలంచెను. అందుచే నామె యాచిత్రపటమును చూచుచు యందున్నట్లు యలంకరించుకొన దలంచెను. ఒకపరిచారికను బిలచి 'చెలీ! నీవు రయంబున రమేశదత్తు గృహమునకరిగి, రాకుమారి శత్రువులచే చిక్కెననియు, తక్షణము గావలయుననియు యాతనికి నమ్మకము గలుగునట్లు వచించి యిటకుఁ దోడ్కొనిరావలయును. జాగ్రత్తసుమా' యనెను. ఆచెలి చిరునవ్వుతో 'యీలోపున నీ వలంకరించుకొని సిద్ధముగ నుండుము గాబోలును.' అనిపల్కుచు నొయ్యారముగ నాగది వదలెను.

రమేశదత్తుహృదయము నాకర్షింపవలయునను తలంపుతో నామె యచ్ఛముగ నాచిత్తరవుతో నున్నట్లే యలంకరించుకొనుచుండెను. అప్పటి యామెసౌందర్య మతీతము. పెన్నిధిగన్న పేదవోలె, చంద్రదర్శనమునకై వేచియున్న కమలముకరణి యామె తన మనోహరునకు తన జగన్మోహనాకృతిని చూపవలయునను నభిలాషతో శృంగారించుకొనుచుండెను.

విధాత యుత్సాహపూరితులఁ గాంచి యోర్వలేడుగదా! దుఃఖితులగు వారిని గాంచుట యాతని కానందము. అందులకుఁగారణము లేకపోలేదు. సంతోషము యులు తననామ ముచ్చరింపరు. దుఃఖితులైనచో నిందారూపమునైన దన్ను తలంతురు. అందుచేతనే యాతఁడు సాధారణముగ మానవులసంతోషమునకు మధ్యమధ్య నాటంకములు గల్గించుచుండును. అయ్యది యాతని కానందము.

నాడు సంపూర్ణోత్సాహముతో నున్నమృణాళిని గాంచి కూడ విధాత యోర్వలేకపోయెను. ఆమె యెవ్వని నిరసించుచుండెనో, ఎవని పేరు విన్న నామె రోషాక్రాంతయగుచుండెనో, ఎవ్వనినాశనము నామె హృదయము కాంక్షించుచుండెనో యాదుర్మార్గుడగు మంత్రి యా భవనమునఁ బ్రవేశించెను. ఆతనిప్రతిబింబము నానిలువుటద్దమునఁగాంచి యామె భయభ్రాంత యయ్యెను. కాని యాసమయమున నాతనినెటులైన మోసబుచ్చి తనప్రియుఁడు రాకముందే సాగ నంపవలయునని నిశ్చయించుకొనెను. తన భయమును వెలిబుచ్చక యామెచిరునవ్వుతో, 'ఓహో! భవిష్యద్రాజేంద్రులు గారలు స్వాగతము.' అనెను.

మంత్రి యాగదియందు ప్రవేశించి యొక సనముపైఁ గూర్చుండెను. 'రాకుమారీ! నే డేలనో బాగుగ నలంకరించుకొనుచుంటివి' అనెను.

'ఏమియు లేదు. ఈ వివాహకాలమున నేయాకృతి మనోహరముగ నుండునో యని చూచుకొనుచుంటిని.'

మంత్రి యామెప్రక్కనున్న చిత్రపటమును గాంచి యాశ్చర్యమందెను. తనశయనాగారమునందలి యాపటము రాకుమారియొద్దకెట్లు వచ్చెనా యని యాతఁడు సందేహింపసాగెను. అయినను యడిగి తెలిసికొనవలయునని నిశ్చయించి 'రాకుమారీ! ఆచిత్రపట మెవ్వరిది? అని ప్రశ్నించెను.

'నాదే'

'వ్రాయించితివా?'

'లేదు'

'మ రెట్లు వచ్చినది?'

'మీశయనాగారమునుండి తెప్పించితిని'

'ఎందులకు?'

'మీహృదయానందకరమగు రూప మేదో తెలిసికొనుటకు"

'ఎవరు తెచ్చిరి?'

'నాపరిచారిక'

'ఎవరియనుజ్ఞపై దెచ్చినది?'

'నాకొకరియాజ్ఞయేల? నాగృహమునం గలవస్తువులు నాయిచ్చ వచ్చినట్లు గైకొనుటకు నాకధికారములేదా?'

'లేదు. ఇప్పుడు నిన్ను చోరత్వనేరముపయి బంధించిన నేమి చేయుదువు?'

'మీబాహుబంధమునా? సంతోషించెదను. కాని యయ్యది యింకను నెలదినములవరకును యసంభవము'

'అటులనా? అయినమారాడను'

'రాజకార్యముల దిలకింపక మీ కిం నేల? మన్నింపుడు. మీరిటనున్న పరిస్థితము నాస్వేచ్ఛకు బాటంకము గలుగును'

'అయినచో వెడలిపోయెదను నీ కయిష్టకార్యము నే నాచరింపం దలంపలేదు. అనిపలుకుచు మంత్రి లేచి రాకుమారియెదుట నున్న చిత్రపటమును ముద్దిడుకొని దానిని యథాస్థానమునసుంచెను. అప్పటి యానంద మతీతము. చిత్రపటమును ముద్దిడుకొనుటచేతనే యంతటి మహదానంద మనుభవించిన మంత్రి నిజముగ రాకుమారినే ముద్దాడం గల్గినచో నాతనిసంతోషము వర్ణింపందరమగునా? పాపము మంత్రి వెర్రిదనము మృణాళికికూడ చిరునవ్వు గలిగించినది.

'ప్రేయసీ! పోయివచ్చెదను" అనిపలికి యాతడు గదిదాటి సావడిలో ప్రవేశించెను. మృణాళిని వదలిపోవుట కాతనిగాళ్ళాడుట లేదు. సావడిలోనుండి మరలవెనుదిరిగి చూచెను. మృణాళిప్రతిబింబ మాతని కానందము కలిగించినవి. కాలవిలంబన మొనరించినచో నామె హృదయమునకు నొప్పిగలిగించినవాడనగుదునని తలంచి యాతడు

మనసు దిట్టపఱచుకొని బయలుదేరెను. మేడమెట్లను సమీపించెను. అతఁడు చటాలున నాగిపోయెను మొగము వెల్లబారెను. మరుక్షణము తనే రక్తవర్ణము దాల్చెను. నేత్రములు కూడ నెఱ్ఱవారెను.

చదువరులారా! ఆతని యాకాకస్మికమార్పునకుఁ గారణమేమో యూహించితిరా? సరిగ నాసమయముననే రమేశదత్తుకొరకు బోయిన చెలికత్తె యాతనితో నరుదెంచి మేడనెక్కెను. దత్తుకూడ మంత్రిని గాంచి రోషకషాయశాత్రుఁడయ్యెను రాకుమారి యాపత్తునం చిక్కుకొనెనని వినినప్పుడే యాతనిహృదయమున రౌద్రరస మాక్రమించెను. ఆతఁడు శరవేగమున నచటకువచ్చియుండెను అప్పుడా సౌధమున గ్రూరుడగు మంత్రినిఁ గాంచినంత నాతని కోపము ద్విగుణీకృతమయ్యెను. ఆతఁడు తనమనోగతరోషము నాపుకొనలేక 'దుర్మార్గుడా! సంతోషముతో జనుచున్నావు. రాకుమారి నేమి చేసితివి?' అని పలుకుచు నాతఁడు వెనుకముందులరయక తనపిడికిట నాయమాత్యుని నొక్కపోటు పొడిచెను.

ఆపాటున కామంత్రి క్రిందపడి మరలలేచెను. ఇరువురును ద్వంద్వ యుద్ధమునకు గడఁగిరి. నిశ్చలహృదయయై శృంగారించుకొనుచున్న రాకుమారి బయటజరుగుచున్న కోలాహలము నాలించి రయంబున ద్వారముకడ కరుదెంచెను. దత్తు మంత్రియు కోదమసింగంబుల ట్లొకరినొకరు డీకొనిరి. ప్రాణంబుల పణంబుగానిడి పోరుచుండిరి. ఆ భయంకర దృశ్యముగాంచి యామె భయభ్రాంతయయ్యెను. కెవ్వున నొక్కకేక వైచి యామె మూర్ఛాక్రాంతయయ్యెను. పరిచారికవచ్చి యామె నెత్తి పర్యంకముపై బరుండజేసి యుపచారము లాచరింప దొడంగెను. ఆహా! తానొకటి తలచిన దైవ మొకటి తలంచు ననుటయిదియేగదా!

రాకుమారి వైచిన కేక దత్తున కుత్సాహము గల్గించెను. భవనమంతయు ప్రతిధ్వనించి యంతదనుక మందముగనున్న భటులందరకును

హెచ్చరిక గలిగించెను. వారందరును యంతిపురములో నేదియో మును
ంగినదని భావించి నాయుధపాణులై రయంబునఁ బయలుదేరి సౌధము
పయి కరుదెంచిరి. అప్పటికె మంత్రి సంపూర్ణముగ నోడిపోయెను.
దత్తు ముష్టిప్రహారముల కాగలేక మూర్ఛాక్రాంతుఁ డయ్యెను. అయి
నను దత్తాతనిఁ గొట్టుటమానలేదు. ఆకస్మికముగ నాతని వెనుక భాగమున
వినంబడిన కోలాహలమాలించి యాతడు వెనుదిరిగి చూచెను. భూమి
యీనినట్లు లెక్కకు మిక్కుటమగు భటులు లగ్గెంచుచుండిరి. వారిం
గాంచి దత్తు చటాలున మంత్రి మొల నున్నఖడ్గమును లాగి యాభటుల
నెదిర్చెను. అతని వీరవిహార మాభటుల నాశ్చర్యనిమగ్నులం గావించె
ను క్రమముగ భటులసంఖ్య వృద్ధియగుచుండెను దత్తుకూడ సైనికు
లెక్కువైనకొలది యుత్సాహమును వృద్ధి గావించుకొనుచు. తననేర్పు
నంతను ప్రకటింపసాగెను. క్షణములో రాకుమారి శుద్ధాంతము సంగ్రా
మ రంగముగా మారిపోయెను. విగతాంగులగు భటుల యవయవముల
నుండి స్రవించుచున్న యుష్ణరక్తము తెల్లనిపాలగచ్చునకు రక్తలేపనము
గావించెను. ఆభటుల యాక్రందనములు మిన్ను ముట్టుచుండెను.

లోన రాకుమారి కుపచారములు గావించుచున్న పరిచారిక
మాటిమాటికి ద్వారముకడ కరుదెంచి యాభయంకరసంగ్రామమును
గాంచుచునే యుండెను. తానుబోయి రమేశదత్తును గోడ్కొనివచ్చు
ట యెరింగినచో మంత్రి నన్నేమి శిక్షించునో యని యామె భయ
మందసాగెను. అయినను యామె యప్పటున నేమి చేయగలదు? దైవ
సంకల్ప మెట్లున్న నట్లు కాకమానదని నిశ్చయించుకొని, ధైర్య మూని
రాకుమార్తె సేవలయం దప్రమత్తురా లయ్యెను.

దత్తింకను పోరాటము మానలేదు. ఒకటిరెండుచోట్ల శరీరమున
గాయములు తగిలినను యాతఁడు లెక్కింపలేదు. ఆగాయములవెంట
రుధిర మెడతెగక ప్రవహించుచునే యుండెను. క్రమముగ నాతనిశక్తి

తప్పగిల్లసాఁగెను, క్రమముగ నాతఁడిక పోరుటకష్టమని పించెను. ఇక నట నాలసించినచో వైరులకు చిక్కిపోవలసివచ్చునని యాత డూహించెను. మెట్లగుండా దిగిపోవు టసాధ్యమయ్యెను. అతఁడు నలుమూలల పరికించెను ఎందును యాతనికిఁ బారిపోవుటకు దారి కాన్పింపలేదు. వడివడిగ మేడచివరకు వచ్చెను. అచ్చట నుండి క్రిందకురికినచో నాతఁడు రాజమార్గమునఁ బడిపోవును. కాని యాసౌధము చాల యెత్తున నున్నది. సామాన్యమానవు లాస్థలమునుండి క్రిందకురికినచో నేయవయవమో విరుగకమానదు. కాని రమేశదత్తు యిసుమంతయు జంకలేదు. మేడచివరనుండి దభాలున క్రిందకురికెను. అతని నేర్పువలన నాతనిశరీరమున కించుకంతయయిన నపాయము గలుగలేదు. తనహయము రాజభటులమధ్యనున్నది. కాలినడకనుపోయినభటులు తప్పక తన్ను కలసికొని బంధింతురు. రమేశదత్తొక్కపరి యీలవేసెను. చిరకాలము నుండి యాపిలుపున కలవాటుపడిన యాహయము తలపంకించుచు సకిలించి రయంబున దత్తును సమీపించెను. దత్తు యశ్వమునధిరోహించి యుత్తరక్షణముననే యదృశ్యుఁడయ్యెను.

ఆహా! కాలమహిమ! తనశృంగారమును రమేశదత్తుకనులం బడజేయ నెంచిన మృణాళి మూర్ఛాక్రాంత యగుటయు, రాకుమారిని రక్షింప నరుదెంచిన దత్తు యామెను చూచుటకైన దీరికలేకుండునట్లామెసౌధమును రక్తసిక్తముగను, పీనుగులపెంటగను నొనర్చి వెడలిపోవుటయు నాశ్చర్యకరముగాదా!

# పదునొకండవ ప్రకరణము.



దత్తు పారిపోయినపిదప నప్పటి కింకను శరీరములు సంపూర్ణ స్వాధీనములం దున్నభటులలో గొందరు హాయారూఢులై యాతని వెంబడించిరి. మరికొందరు మంత్రి కుపచారము గావింప నాతని మంత్రి సౌధమునకు దోడ్కొనిపోయిరి. క్షణములో నా ప్రదేశ మంతయు నిశ్శబ్దమయ్యెను. పరిచారిక యీవలకు వచ్చి చూచెను. పాపము దత్తు పారిపోవు టామె చూచియుండకపోవుటచేత నాత డేమయ్యెనో తెలిసికొనలేక పోయెను. అంతకుముందు తా నసంఖ్యాకులగు భటులం దిలకించి యుండుటచే నాతడు వారలకుఁ జిక్కియుండునని నిశ్చయించుకొనెను. ఆమె నిజస్థితి యెట్లు తెలిసికొనఁ గలదు.

మరికొంతసేపటికి మృణాళి తెలివిగాంచెను. పరిచారిక యామెకించుక శీతలోదక మొసంగెను. మృణాళి యాజలమును గ్రోలి యాత్రితుతో 'చెలీ! దత్తే మయ్యెను?' అనెను.

'నేను చూడలేదు. నీవు ప్రాణాపాయస్థితిలో నుండుటచే నిన్ను విడచి బయట కరుగుటకు వీలులేకపోయినది. ఘోరభీకరముగ జరుగుచుండ నొకటిరెండుమారు లరిగి చూచితిని. ఆకస్మికముగ కోలాహల మాగిపోయెను. కొందరు భటులు మాత్రము తొలుతనే సొమ్మసిల్లఁబడియున్న మంత్రిని మోసికొనిపోవుచుండుట గాంచితిని.

'చెలీ! నాకు మిగుల భయమగుచున్నది, నీవు వెంటనే దత్తు గృహమున కరిగి యాతని క్షేమ మరసిరమ్ము. ఆలసించిన ప్రాణములు నిలుపలేను.

పరిచారిక మారుపలుకక వెడలిపోయెను.

"అక్కటా! నా కెట్టి దుర్బుద్ధి పుట్టినది? సుఖముగ నింట నూరుచున్న యాతని నకారణముగ నిట కేల పిలిపించితిని? పిలిపించితినిబో దైవము నిర్దయుండై వా రిరువురను తారసిల్ల చేయవలయునా? ఇదం తయు నా దురదృష్టము. నాదురదృష్టమే నాతండ్రిని రాజ్యభ్రష్టునిం గావించినది. నాదురదృష్టమే యుదారస్వరూపుండును, శౌర్యధైర్యాది గుణసంపన్నుండునగు రమేశదత్తు నుద్యోగభ్రష్టునిం గావించుట యే గాక యాతని కనుదినమును నేదియో యొకవిపత్తు దెచ్చిపెట్టుచునే యున్నది. నాదురదృష్టమే ప్రభుభక్తిపరాయణులగు ననసంఖ్యాకభటుల సమూహమును మృత్యుముఖమునకుం ద్రోయుచున్నది. నాయొక్క జీవము నశించినదో నీవిపరీతము లేమియుం దటస్థించియుండవుగదా! దైవమా! ఇంవరి కష్టములు గలిగించుటకంటె నన్ను మరణింపం జేసిన నెంతయు సంతసించి యుండుదునుగదా! ఛీ! నాజీవితము వ్యర్థము' అని తన్ను తా నిందించుకొనుచు మృణాళి యున్మాదినియై యాటియాటికిని తన నెచ్చెలి రాకకై మేడచివర కరుదెంచి మార్గమువైపు చూచు చుండెను

రాకుమారీసౌధమునకును రమేశదత్తు ప్రస్తుతనివాసమునకును సుమారు రెండుమైళ్లు దూరముండును. అంతదూరము కాలినడకను పోయివచ్చుట కధమ మొకగంటయైనం బట్టును. రాకుమారి యారాటపడినంతమాత్రమున కాలము పరువెత్తునా? పరిచారికకు రెక్కలు వచ్చునా? క్షణక్షణమునకును మృణాళి యారాట మతీత మగుచుండెను. దత్తుం క్షేమవిషయమున నామెకుంగలిగిన యనుమానము వృద్ధి కాదొడంగెను. ఏమిచేయుటకును దోచక యామె మరల తనశయనాగారమును చేరెను. శయ్యపై మేను వాల్చెను.

'అకటా! దురాశ దుఃఖమునకుం గారణముగదా! దత్తు నన్ను ప్రేమించెనని యెరింగి యుండియు నామాట నాతని నోటివెంట చెప్పింప

దలంచి నా మనోహరుని కెట్టికష్టము కలిగించితిని! నాశృంగారకాంక్షయే నాకిట్టి విపరీతపుబుద్ధి పుట్టించినది. మనోహరుని యెడ మఱపా లొనరించిన నాయీశృంగారము కాల్పనా? వలదు. ఈచీనిచీనాంబరములు, యీయాభరణములు నాహృదయేశుని పవిత్రహృదయము నాకర్షింపజాలవు. దత్తు సహజసౌందర్యమును ప్రేమించును. నాయీగరగిరెడ్డు వేషము గాంచి యాతఁడసహ్యాపడునని తలంచియే విధాత యిట్టి విపరీతమును గలిగించెను. ఈయలంకారములన్నియుం దీసివైచెదనని తలంచి యామె శిరస్సుపై నుండి లేచెను. దర్పముకడ కరిగి తాను ధరించిన యాభరణములన్నియు నొక్కొక్కటిగ దీసి యాగది నలుమూలల పారవయివ దొడంగెను. అచిరకాలములో నామె యాభరణరహితయయ్యెను. ఆమెధరించి మకూలవసనము గూడ యామెకసహ్యముగ దోచెను ఆమె వెంటనే యొకసామాన్యపు చీరధరించెను పాఠకులారా! మృణాళి తలంచినది నిక్కువము. చిత్రపటములోని యాకృతికన్న నప్పటిరాకుమారి రూపము దర్శనీయమై యొప్పుచున్నది. ఆమె కాషాయవసనంబును ధరించినచో కణ్వాశ్రమంబున నివశించుచున్న శకుంతల స్మరణకు వచ్చుటనిక్కము.

తనయలంకారములన్నియుఁ దీసివైచి సామాన్యవేషమున నామె మరల మేడచివరకువచ్చి రాజమార్గమును బరిశీలింపసాఁగెను. చాల దూరమున నామెకు పరిచారిక గోచరించెను. ఆమె రాకుమారితలంచిన దానికన్న నెక్కుడువడిగ వచ్చుచుండెను. అచిరకాలముననే యామె సౌధమునుచేరెను! భవనము సమీపించినంత రాకుమారిపై నుండియే 'యేమయినది!" అనెను. పరిచారిక 'పండు' అనిమాత్రము పలికి మేడ నారోహించెను.

రాకుమారి యెదురేగి పరిచారకను గైకొనివచ్చి తనశయనాగారమునందలి తల్పమునఁ గూర్చుండఁజేసి 'చెలీ! నీవు దత్తును చూచి

తివా! ఎట్లుండెను. శరీరమునఁ గాయములేమియు దగులలేదు కదా?' యనెను.

'నేను చూడలేదు. ఆతఁడింటివద్దలేడు. ఒకచీటిమాత్రము తల్లి కొసంగి వెంటనే గుఱ్ఱమెక్కి వెడలిపోయెనట. రాకుమారివద్దనుండి యెవఁరయిన వచ్చిన నాచీటి నొసంగమనెనట. నేబోయి నేనురాకుమారి పరిచారికనని యెరింగించినంతనే యామె యాచీటినాకిచ్చెను.'

'ఆచీటియేదీ?'

పరిచారిక చీటినొసంగెను. మృణాళి యాచీటినివిప్పి యిట్లు చదువసాగెను.

'రాకుమారీ!

నాక్షేమమునకయి నీవువిచారింపవలదు. నేనుసుఖముగనే యున్నాను. నీకసాయము సంభవించినచో మరల మాయింటికే వర్తమాన మంపుము.

ఇట్లు,
నీ క్షేమకాంక్షి,
రమేశదత్తు'

రాకుమారిహృదయము శాంతినందెను. కాని యాతనిశరీరస్థితి కనులార చూడఁజాలకపోయినందులకుమాత్రమామె యించుక చింతాకులస్వాంతయయ్యెను. ఆతనినిదర్శింప నామెమది యుత్సహింపసాగెను. వారిరువురట్లు కూర్చుండి యాలోచించుచుండగనే రెండుయామములు దాటిపోయెను.

---

# పంద్రెండవ ప్రకరణము.



పాఠకులారా! పాపము గాయపడియున్న రమేశదత్తు యేమయ్యె
నో చూచివత్తము. దత్తు రాజాంతఃపురమువదలి తనగృహమున కరిగె
ననియు యటతనతల్లి క్రోకయుత్తరమొసంగి యటకోవెడలిపోయెననియు
వెనుకటి ప్రకరణంబునఁ జెప్పియుంటిమిగదా! ఆతఁడిలువీడి రయంబునఁ
గౌరడారాణి నివాసస్థలమునకుఁబోయెను. తనకష్టకాలమునఁ దనకుసాయ
పడువా రారాణిదక్క యెవ్వరునులేరని యాతడు దృఢముగ నమ్మి
యుండెను. తనశరీరమునందలి గాయములు తగ్గువరకును తనకుపచారము
లొనర్పవలెను. స్వగృహమున నున్నచో తల్లి సేవచేయునుగాని యేసమ
యమున మంత్రిభటులువచ్చి తన్నుబంధింతురోయని యాతఁడు చిం
తింప దొడంగెను. ఆభయముచేతనే యాతఁడు రహస్యవాసము కాం
క్షించి యాకౌరడారాణినివాసమున కరిగెను. ఆతనిగుఱ్ఱ మాకుటీరముల
చేరుసరి కాతనిశక్తి సంపూర్ణముగ నశించెను. గుఱ్ఱము దిగుటకైన
నాతనికి శక్తిలేదు. అచ్చటనున్నభటులు దత్తునుగాంచి యానవాలు
పట్టిరి. ఆతనిదుస్థితికి విచారించి యాతనిభూగృహంబులోనికిం గొని
పోయి యటనున్న పట్టెమంచముపై బరుండజేసిరి. దత్తు శరీరమునకుఁ
దగిలినగాయములకు కట్లుకట్టి యాభటులాతని కుపచారములు గావింప
సాగిరి.

ఆసమయమున కౌరడారాణియే యటనున్నచో నాతని దీనస్థితి
కామె యెంతగుందునో! దుఃఖించుటయేగాదు. వెంటనే యాముష్కరు
డగు మంత్రిని యాతనిసైన్యమునుఁగూడ రూపుమాపకుండునా? అనే
క పర్యాయములు మంత్రిని బంధింపవలయునని తలంచుచుండియు

సురేంద్రుని జాడ తెలియకపోవుటచే నామె యాతనిని బంధించు యత్నము మానివేసినదనుసంగతి మాపాఠకులెరింగియుండుటచే నిటమరల నుదహ రింపలేదు.

దత్తున కించుక తెలివివచ్చినపిదప నారాణి యరుదెంచెను. ఆమె కుటీరము కడకు వచ్చినంతనే యటనున్న భటుండామెను గాంచి 'మహా రాణీ! రమేశదత్తు గాయపడిన శరీరముతో స్పృహదప్పి గుర్రముపయి వచ్చెను. మేమాతని లోనఁ బరుండఁజేసి గాయములకు కట్లుకట్టితిమి. మీయాజ్ఞ లేకుండ మేమొనరించినది తప్పయినచో మన్నింతురుగాక' అనెను.

'ఏమి! దత్తా! ఇప్పుడెట్లున్నది?'

'తెలివివచ్చినది. మీరాకకై కలవరించుచుండెను'

రాణి వెంటనే లోనఁ బ్రవేశించెను తనతల్పంబున దత్తుపరుండి యుండెను. నీరసమునే నాతడు కనులుమూసికొనియుండెను. రాణి యాతని సమీపించి 'దత్తూ! ఎట్లున్నది?' అనెను.

దత్తు కన్నులు తెరచెను. ఎదుటనున్న రాణినిగాంచి 'తరుణీ! వచ్చితివా? నారీ నాపత్కాలమున నీకంటె వేరుదిక్కుగానక యిట కరు దెంచితిని నాకు మిక్కుటముగ నాకలి వేయుచున్నది. కొంచెము హార మొసంగిన గాని జీవించుట దుర్లభము' అనెను.

తోడనే రాణి యావలకువచ్చి యొకభటునితో నేమో చెప్పి యంపెను. తాను తిరుగ లోనికేంబోయి 'దత్తూ! భీతిల్లకుము. త్వరలో నే యాహారపదార్థములు రాగలవు' అనెను.

'తరుణీ! అన్నిటికన్న ముఖ్యవిషయము. రాకుమారి కేదయినఁ గష్టము సంభవించిన మాయింటికి వర్తమాన మంపుమని తెలిపియుం టిని. అదియుంగాక మాయింట నావృద్ధజననిదక్క మరెవ్వరును లేరు.

నాపై గలకోపముచే నాతఁ డామె కేమయినహాని కలిగించునేమోయని భయమగుచున్నది. కావున——'

'భయములేదు. రాకుమారి కేవిధమగు హానియు గలుగకుండు నట్లేర్పాటులఁ గావించి వచ్చితిని. ఒకభటుని బంపినీజననినిగూడ నిటకు రప్పించెదను. తెలిసినదా?'

దత్తిప్పుడు ప్రశాంతహృదయుఁడయ్యెను. ఆయువతి తన కొసరించుచున్న యుపకారమున నాతఁ డెన్నిజన్మములామెను సేవించినను ఋణవిముక్తుడు కాఁజాలడని యాతడు భావించెను. స్త్రీయయ్యును పురుషులమించిన ప్రజ్ఞావిశేషములతో దేశసేవకై యామె యనేకపర్యాయములు తనకొరడామాత్రసహాయయై రాజద్రోహులను యొడళ్లు చిట్లునట్లుమోది మెప్పుగాంచెను. అందుచేతనే యామె జన్మనామము నశించి కొరడారాణి యనుపేరామెకు సార్థకమయ్యెను.

ఆహారపదార్థములకొరకరిగిన భటుఁడు కొన్నిగోధుమరొట్టెలు రొకవెండిగ్లాసుతో పాలు గైకొని వచ్చెను. దత్తారొట్టెలను భుజించి యాపాలను స్వీకరింప గ్లాసు గైకొనెను. ఆగ్లాసుపై మూడక్షరము లుండెను. ఆయక్షరము లాతని నాశ్చర్యసాగరమునం ద్రోసివైచెను. ఆతఁడు తెల్లబోయి 'తరుణీ! ఈపదార్థము లెచ్చటనుండి వచ్చినవి?' యనెను.

'ఏల యడ్లడుగుచుంటివి?'

'ఏమియులేదు. ఈగ్లాసుపై రాకుమారి నామమున్నది'

'కావచ్చును. ఇవన్నియు నచటనుండియే వచ్చినవి'

'తరుణీ! పాపము నాయస్వస్థత విని యామె యెంత పరితపించునో గదా!'

'నీయస్వస్థత యామె కెట్లు తెలియును? ఎంతమాత్ర మెరుంగజాలదు. నీవూరలేవనియు, నాలుగైదు దినములవఱకు తిరిగి రావనియు

నందుచే నవసరమైనచో నిచ్చుటకు వర్తమాన మంపవలసినదని యు చెప్పి పంపితిని.'

'మంచిపని చేసితివి. ఏపరిస్థితులందుననుగూడ నాయీయాయస్వస్థత నామె యెరుంగరాదుసుమా! మరియొకవిషయము. దయయుంచి యను దినమును యీయామె క్షేమవార్తమాత్రము తెలిసికొనుచుందుము.

'ఏల నామెకొఱకింత యారాట మందుచుంటివి?'

'మంత్రి చాల దుర్మార్గుడని నీవెరింగినదేకదా?'

'కావచ్చును. రాకుమార్తె యేమయిన నీకేమి?'

'నను పరీక్షించుచుంటివా? ఏమో చెప్పజాలను. ఆమెకష్టము లందుచుండుటచూచి నేనుసహింపజాలను. నాకిట్టిస్థితి కలుగుట కదియే కారణము.'

'ఇంత వర్ణనమెందులకు? ప్రేమించితినని యొక్కమాట పలికిన తెలియునుగదా?'

'అదెట్లు పొసగును? సామాన్యభటుఁడనగు నేను—ఇప్పు డట్లనుకొనుటకూడ యసంభవమే—సామాన్యపేద పౌరుడనగు నేను—అఖండలక్ష్మీసంపన్నయగు రాకుమారిని వరించితినని పలికినచో విన్న వారు నవ్వరా?'

'జ్ఞాను లెవ్వరును నవ్వరు. ఏమందువా? ప్రేమను ధనధాన్యాది యాడంబరములు, రాజపదవి మున్నగు యధికారము లాటంకపరుపఁ జాలవు. అయ్యది పవిత్రమయినది. నిశ్చలమయినది. లోకాతీతప్రభావము గలది. ఆప్రేమకు ధనతారతమ్యముగాని, కులభేదముగాని కొద్దిగొప్పలు గాని కాన్పింపవు.'

'కావచ్చును. కాని యయ్యది ఫలించునవఱకును యొరుల కెరింగించినచో బ్రమాదము కలుగవచ్చును.'

'నేను పెరదాననా? మనయిరువురిచరిత్రము లోకరివొకరము

సంపూర్ణముగ నెఱుంగకపోయినను ప్రథమదర్శనముననే మనహృదయము లేకీభవించినవి. ప్రథమదినమున నీపౌరుషవిక్రమాదులం గాంచునప్పుడే నీ పవిత్రహృదయము నన్నాకర్షించినది. ఆనాఁడే నిన్ను నాప్రాణతుల్యునిగ దలంచితిని. దత్తూ! నాహృదయపారిశుద్ధ్యము నీ వెరుఁగకపోవుటచేతనే నన్నిట్లు నమ్మక పెరవానిగదలంచుచున్నావు'

ఆమాటలకు దత్తుంచుక లజ్జితుఁడయ్యెను. తనయవివేకమునకు తన్నుదాను నిందించుకొనెను. రెండుపర్యాయములు వైరులచే జిక్కిన దన్ను రక్షించి,యెరుఁగని మహత్తరరహస్యముల దనకెరింగించిన యీసాధ్వీలలామను, దేశసేవాపరాయణురాలిని పెరదానిగ తలంచి తన హృదయాభిప్రాయముల నామెకడగూడ గుప్తపరచుచుండుట నిజముగ నాతని యవివేకము. అతఁడాలోచనానిమగ్నుఁడయ్యెను. తనసూక్ష్మ బుద్ధి యట్లు మొద్దువారిపోవుట నాతనికే యాశ్చర్యము గలిగించెను.

'దత్తూ! ఏ మాలోచించుచుంటివి? నాపలుకులు నీకు బాధాకరము లగుచుండెనా?"

'లేదు-లేదు. నీపలుకులు నాకు హితోపదేశము లైనవి. ఇంతవఱకు మూయఁబడిన నానేత్రములు తెరువఁబడెను.'

'ఇప్పుడు చెప్పుము. నీవు నిజముగ రాకుమారిని ప్రేమించి యుంటివా?'

'అవును.'

'సెబాసు! నాయభీష్టము నెరవేరినది నేను రాకుమారికొసఁగిన వాగ్దానము నేటికి సఫలమైనది. సరిగాని మొన్న కనకవల్లిని వెంబడించితివిగదా! అచ్చటి విశేషములేమి?'

'నీతో సంభాషించి వెడలిపోయినపిదప నేను తిన్నగ మంత్రిసౌధమునఁ జొరబడితిని. అచట నాకేమియు విశేషములుగాన్పింపలేదు. గదిలోని గోడకు మూడు స్త్రీచిత్రపటము లున్నవి. అందొక్కటి

నా తెలివిచే నేను గుర్తింపఁ గలిగితిని. అది మృణాళినిది ఆపటమును తీసి న వస్త్రాభ్యంతరమున మరుగుపరచుకొంటిని. ఇంతలో మంత్రియు, సేనాపతియు, వేరొకయువకుఁడును యాగదియందు ప్రవేశించి చాల సేపు సంభాషించిరి ఆసంభాషణాసారాంశములలో మొదటిది రాకుమారి మంత్రిని పెండ్లాడుట కంగీకరించి యారువారములు గడువడుగుట. రెండవది కనకవల్లిని గంగానది యావలితీరమున విడచునట్లు మంత్రిగారొసంగినయాజ్ఞ. కనకవల్లిపై నాతనికిం గలయాగ్రహముగ నాగది యందలి స్త్రీ చిత్రపటములలో నొకటియగు కనకవల్లి చిత్తరువును గంగాప్రవాహమునం బారవేయుమని సేనాపతితో చెప్పుచు నాపటము నొసంగుటకై గోడవైపు చూచెను. అంతకు ముందుగనే నేను రాకుమారి చిత్రపటమును తస్కరించుటచే నాతని కాపటము గాన్పింప లేదు. ఆతఁ డాపటమును దొంగిలించిన వానిని పట్టుకొనవలెనని యత్నించెనుగాని సేనాపతియుపదేశముపై నాయత్నముమాని శాంతచిత్తుఁడయ్యెను. ఇంతలో వారేలనో యాగది వదలిరి. ఆయవకాశమున నే నాభవనము వీడి యావల కరుదెంచితిని. రాజమార్గమున బోవుచున్న నన్ను గాంచి మేడపైనుండి రాకుమారి పిలుచుటచే నచట కరిగితిని. ఆమెతో నే నేమేమో సంభాషించితిని. ఫలితము నాపటము నట మరచిపోయితిని. ఇంతలో మూఁడుగంట లగుటచే కనకవల్లిని గొని పోవుసమయ మాసన్న మగుటచే పటము మాట మరచి వెడలి పోయితిని.

నేను గంగాతీరము చేరుసరికి సేనాపతియు కనకవల్లియు నావ నెక్కిరి. నావ నడుపుటకు రెండవవాఁడు లేకపోవుటచే నావవాఁ డాలోచించుచుండెను. ఆసమయమున మరసి నేనాయుద్యోగము స్వీకరించి యానావమీఁద నే సురక్షితముగ నావలితీరము చేరితిని. దారిలో నాసేనాపతి కనకవల్లుల ప్రణయసంభాషణము నా కాశ్చర్యము గలిగించెను.

ఆవలితీరము చేరినంతనే వారిరువురును నావ దిగి యొకగుహాలోని కరిగిరి. నేనుగూడ వారిని వెంబడించితిని. సేనాపతి కనకవల్లి నాగుహలో విడచి యీవలకు వచ్చునప్పటికి యాయరణ్యవాసుల నాయకుఁడాతని కెదురయ్యెను. సేనాపతిఆతనికొకయుత్తర మొసంగినావకడ కరిగెను. ఆనాయకుఁడు మరల గుహలోని కరుగుటచే నేనుకూడ నాతని వెంబడించితిని ఆతఁడు వచ్చి నెత్తురుత్రాగువాడని యాతనికిని కనకవల్లికిని జరిగిన సంభాషణలనుబట్టి దెలిసికొంటిని. ఆతఁడామెను బెదిరించి యీవలకు వచ్చినపిదప నే నామెకు నావృత్తాంత మెరింగించు ధైర్యము గొలిపి మరల నావను సమీపింపవలయునని యీవలకు వచ్చితిని. ఇంతలో నావనచరులు నన్ను బంధించిరి. కాని యెట్టకేల కానాయకుని దయవలన విడివడి యీవలకరుదెంచితిని. నావను సమీపించు సరికి నావవాడు సేనాపతికూడ నాకొరకెదురుచూచుచుండిరి. నాయాలస్యమునకు మన్నింపు, బ్రార్థించి నావపై నీవలకు వచ్చితిని. ఆదినముననే నే నిట కరుదెంచితిని. కాని నీవూరలేవని వినుటచే నీవిషయములు నీ కెరింగించుటకు వీలుపడినదిగాదు. మనరాజేంద్రుడుకూడ నచ్చటనే యుండియుండు నని నా యభిప్రాయము.'

'సందేహమేల? మంత్రి ప్రభువునుగూడ నచ్చటనే బంధించెను.'

'అయిన మనమాతనిని విడిపించి మంత్రిసేల బంధింపరాదు?'

'నేను నదియె యాలోచించుచుంటిని. నీశరీరమునకుఁ గొంచెము స్వస్థత చేకూరినపిదప నాపని గావింతము.'

వారిట్లు సంభాషించుచుండగనే యాతరుణిచే పంపఁబడిన భటుఁడు దస్యుతల్లితో నట కరుదెంచెను. ఆవృద్ధురాలు కుమారుని స్థితి గాంచి దుఃఖించెను. కాని యారాణి శాంతవచనములచే నామె యూరట చెందెను.

---

# పదమూడవప్రకరణము.



నాఁడు గంగానది తరంగరహితమై ప్రశాంతముగ పారుచుుం డెను. నిశాసమయ మగుట వారణాసీనగరముకూడ నాగంగాస్రవంతి వలెనే ప్రశాంతతఁ దాల్చెను. నగరవాసు లెల్లరును నిద్రాముద్రితు లై యుండిరి. రెండుయామములు దాటిపోయెను. రక్షకభటులహెచ్చ రిక శబ్దములు కేచురాయి స్వరములు దక్క మరేమియు వినంబడుట లేదు. చీకటిరాత్రి యగుటచేతను, దానికిం దోడు యాకసము మేఘా వృత మగుటచేతను నిబిడాంధకారము నలుదట్ల నలుముకొనెను.

ఆకాళరాత్రి రాజసౌధమునుండి యొకవ్యక్తి వడివడిగ నడచి గంగాతీరమున కరుగుచుండెను. చీకటి యగుటచే నాతఁ డెవ్వరో పో ల్చుట కవకాశము లేదు.

ఆవ్యక్తి సౌధము విడచి సరిగ నొకఫర్లాంగుదూర మరిగి యాక స్మికముగ నాగిపోయెను. అతనివెనుక నెవ్వరో వెంబడించుచున్నట్లు పదధ్వని యాతనివీనులకు సోకెను. ఆవ్యక్తి యాగి చాలసే పాలకిం చెను, కాని యతని కేమియుఁ వినబడలేదు. నలువైపుల దిలకించెను. ఎవ్వరును గాన్పింపలేదు. మరల నడువసాగెను. కొంతదూర మేగునరికి మరల పదధ్వని వినంబడెను ఆవ్యక్తి యాందోళన స్వాంతుఁడై మరల నాగెను. కాని యాతని కేమియు వినఁబడలేదు.

ఈవిధముగ నాతఁ డెట్టకేలకు నదిని సమీపించెను. నదిని దాటు టాతని తలంపై యుండును. ఆత డొక నావను సమీపించి యందు పరిశీలించెను. నావ నడుపుటకుఁ దగినపరికరము లన్నియు నం దున్నవి. ఆతఁ డానావ నెక్కబోవునంత మరల నాతనికి పదధ్వని వినం బడెను. ఇప్పు డాధ్వని మునుపటికంటె దగ్గరగా వినంబడ జొచ్చెను. ఆ

వ్యక్తి తన్నెవ్వరో వెంబడించుచుండుట నిజమని ధృఢపరచుకొనెను. అయినను లక్ష్యముంచలేదు. ఆతఁడు నావలో కూర్చుండి తెడ్డుతో నీటిని త్రోదుకొనుచు నావను నది కడ్డముగ బోనిచ్చెను. కాని యాతని యనుమాన మంతలో దీరలేదు. ఆతని వెనుక మరల తెడ్ల చప్పుడు వినవచ్చెను.

పాఠకులారా! మనవ్యక్తి భ్రాంతి నందుచుండెనా! లేక నిజముగ నెవ్వరయిన నాతనిని వెంబడించుచుండిరా? ఆతఁ డూరక సందేహించు వాఁడు గాఁడు. పిరికిపంద గాడనియు ధైర్యగుణసంపన్నుఁ డనియు నాతని యర్ధరాత్రిప్రయాణమే చాటుచున్నది. ఆతఁ డూరక సందేహించు వాడు కాడు. నిజముగ నాతనినొకవ్యక్తి వెంబడించుచునే యుండెను. రెండవవ్యక్తి మొదటివ్యక్తిని సమీపించెను. తననావను మొదటినావ ప్రక్కనే బోనిచ్చెను. మొదటివ్యక్తి సందేహము తీరిపోయెను. తన్నొక వైరి యనుసరించి నట్లాత డప్పుడు గ్రహించెను.

'ఎవరు వారు.'

'మారాడక నావలోనికి రమ్ము.'

'ఏమంత గంభీరముగ పల్కుచుంటివి? క్రిందుమీదు లరయ కున్నావు నే పేరేమి? న న్నేల వెంబడించుచుంటివి?'

రెండవవ్యక్తి యొక్క వికటహాసము గావించెను. ఏమి నా పేరు తెలుపవలయునా? ఏనామము వారణాసీ నగరవాసుల నానందవారాసి నోలలాడించుచు వారిచే స్తుతింపఁ బడుచుండెనో—యేనామము రాజో ద్యోగుల కందరకును హృదయశల్యమై యమితభీతిని గలిగించుచుండె నో—యాకొరడారాణిని నేనే. తెలసినదా? సేనాపతీ! నీహృదయమున నించుకంతయు రాజభక్తి యనునది యున్నచో మారుపలుకక నే చెప్పి నట్లుచేయుము. రాజ్యము నుద్ధరింపుము.' అని హెచ్చరించెను.

మొదటివ్యక్తి సేనాపతి. పాఠకులారా! సేనాపతి సహజముగ ప్రభుభక్తి పరాయణుం డయ్యెను, ధనాశచే మంత్రియాజ్ఞను పాలింప వలసినవాం డయ్యెను. అంతవరకు తన్నాదరించువారు లేకపోవుటచే రాజు తొలుత బంధింపంబడినప్పు డాతనిరక్షణముసకై సేనాపతి కున్న పట్టుదల యిప్పుడు నశించెను. ఇప్పటికిని యది సంపూర్ణముగ నశింప లేదు. అందులకుం గారణము చిరకాలమునుండి యాతండు వినుచున సుప్రసిద్ధదేశసేవకురాలగు కొరడారాణి నామము. ఇంతవఱకు నాతం డామె పేరు వినుటయేగాని యెన్నడును కనులార గాంచి యెరుంగడు. ఇప్పు డాకొరడారాణి తనయెదుట నిలచి ప్రభుభక్తిని ప్రబోధించు చుండుటచే నాతనిహృదయమున మినుకు మినుకుమని వెలుంగుచున్న రాజభక్తి యభివృద్ధి గాంచజొచ్చెను. 'ఓరాణీ! ప్రస్తుతము మాకు ప్రభువు మంత్రియే. కావున నే నాతని యాజ్ఞ నవశ్యము పాలింపవల సినదే' అనెను.

'మంత్రి యెట్లు నీకు ప్రభు వయ్యెను?'

'ఆతండు నాకుటుంబమును పోషించుచుండుటచేత?'

'అంతియేనా? ఈక్షణమునుండి నేను నీకుటుంబమునకుం దగిన ధన మొసంగెదను. నీవు ప్రేమించిన కనకవల్లిని నీయధీన మొనర్చెదను. నాయాజ్ఞ ప్రకారము వర్తింతువా?'

తాను చేసిన పాపముల నన్నిటిని పోగొట్టుకొనుట కంతకన్న మంచియుపాయ మాసేనాపతికిం దోచలేదు. తా నప్పుడు వ్యతిరేకించి నచో తనయాయువు లానదీగర్భమునసే ముగియును. తాను మన్నించినపిదప నాతని దారాపుత్రుల నాదరించు వారు లేరు. అందుచే నాతండు ముందుముం దమితఖ్యాతియు, నైశ్వర్యమునుగూడ బడయ వచ్చునని తలంచెను.

'ఓరాణీ! అట్లే గావించెదను. స న్నిప్పు డేమి చేయుమందువు?'

'నా నావమీఁదికి రమ్ము.'

సేనాపతి రాణి నావపై కెక్కెను. మొదటినావను త్రాటిచే వాఁడినావకు బంధించుకొని వారిరువురును తెడ్డసహాయమున నచిర కాలములో తీరము చేరిరి. ఇరువురు నావ దిగి యారెండునావలను యథారీతిని బంధించిరి.

'సేనాపతీ! నీగృహమున కరిగి నీకుటుంబము నంతను వెంటబెట్టు కొని నానివాసమున కరుగుదము.' అని పలుకుచు నాకొరడారాణి సేనాపతి చేయిపట్టుకొని నడువసాగెను. సేనాపతియు నామెను వెంబడిం చెను. ఇరువురును సేనాపతి గృహము చేరిరి. ఇంట నెల్లరును నిద్రాము ద్రితులై యుండ సేనాపతి ద్వారమును బయట బంధించి బయలు దేరెను. అందుచే వాఁకిలు చేరినంత సేనాపతి బయటితాళము తీసి తలు పులను తెరచెను. ఇరువురును లోనఁ బ్రవేశించిరి.

'సేనాపతీ! నీభార్యను కుమారుని లేపుము.' అని పలుకుచు నామె యొకలాంతరును గొని వీధిలోనికి వచ్చెను. సేనాపతి గృహము నకు సమీపముననే రాజేంద్రుని యశ్వశాల గలదు. ఆమె తిన్నగా నాశాలలో బ్రవేశించి రెండుజవనాశ్వముల దోడ్కొని వచ్చి సేనాపతి యింటిముందు నిలిపెను.

ఇంతలో సేనాపతిభార్యయు కుమారుఁడును లేచిరి. వారు కొర డారాణిని గాంచినంతనే భీతిల్లసాగిరి. అదిచూచి యారాణి, 'అమ్మా! భీతిల్లకుము. నేను మీకు హానియొనర్ప నరుదెంచి యుండలేదు. మీ కుపకార మొనర్చుటకే వచ్చితిని.' అని పలికి యామె సేనాపతివైపు తిరిగి, 'వీధిలో రెండుగుఱ్ఱము లున్నవి. ఒకదానిపై నీతనయునితో నధి రోహింపుము. రెండవదానిపై మే మిరువురమును బ్రయాణము గావిం తము.' అని పలికెను.

సేనాపతి యంగీకరించెను. వారు నలువురును యీావల కరుదెం చిరి. కవాట మెప్పటియట్ల బంధించి తాళము వైచిరి. వారు నలువు

రును రాణిచెప్పిన ప్రకార మశ్వముల నదిరోహించి రాజసౌధమును సమీపించునరికి మూడుగంటలయ్యెను. అశ్వముల బరువెత్తించుచు వారు నాల్గుగంట లగుసరికి రాణి వాసస్థలమును చేరిరి.

దూరమునుండియే గుఱ్ఱపుడెక్కలశబ్దము నాలించి యామె యనుచరులు కత్తులను సవరించుకొనసాగిరి. నలువురును పాకలకనతి దూరముననే గుఱ్ఱముల డిగ్గి కాలినకడను బోవనిశ్చయించిరి. రాణి యా రెండుగుఱ్ఱములకు చెవిలో నేమియో చెప్పి వెనుకకు మరల్చెను. ఆహయములు క్షణములో నచ్చోటు వాసి యదృశ్యమయ్యెను.

రాణి తనభటుల యప్రమత్తత కానందించి వారి సాంకేతిక మును దెలుపు నట్లొక యీలనూదెను. భటులందరను యా యీలవిని ఖడ్గముల భద్రపరచుకొని వారి కెదురువచ్చి వినయంబున నభివాదము లొనరిచిరి. రాణి యీలవిని యంతదనుక నిద్రించుచున్న రమేశదత్తు మేల్కాంచి మెల్లగ ద్వారమును సమీపించెను. అప్పటికే ద్వారమును చేరిన యాతరుణి 'దత్తూ! యని పిలచెను.'

దత్తు—రాణీ! ఎక్కడనుండి నీరాక! వీరెవరు?

రాణి—సేనాపతికుటుంబము. లోనికి రమ్మంతయు నెరింగించెదను.

ఆపలుకు లాతని కాశ్చర్యము కలిగించెను. తొలుత నామె వారల బంధించి తెచ్చుచున్న దనుకొనెను. కాని వారెవ్వరనుగూడ బంధితులవలెగాక బంధుగులవలె బ్రవర్తించుటయే యిందులకుగారణము.

సేనా—తరుణీ! దత్తెవ్వరు?

రాణి—ఎరుగవా? రమేశదత్తు.

దత్తు—ఓహో! సేనాపతిగారూ! అప్పుడే మరచితిరా? మన మిరువుర మొక్కనావపై బ్రయాణము గావించి యొక్కమాసమయిన గాలేదు.

అందరును లోని కరుదెంచి యాసీనులైరి.

సేనా—దత్తూ! ఎప్పుడు ప్రయాణము గావించితిమి?

దత్తు—అనుకొనినట్లే యైనది. కనక వల్లిని గంగానది యీవల దిగవిడచి వచ్చుటకు.

సేనాపతి యాశ్చర్య మందెను. ఆనాడు తా నొక్కక్షణమాత్రమే ప్రయాణము చేసెను. ఆలోచనానంతరమున నారెండవనావం వాడే దత్తయియుండునని నిశ్చయించుకొనెను. తన యుద్దేశ మాతని కెరింగించికూడా నాప్రత్యుత్తరమునే బడసెను.

అప్పటి కింకను గంట పొద్దుండుటచేత సేనాపతి భార్యాపుత్రులు మరల నిద్రించిరి.



# పదునాల్గవ ప్రకరణము.



తెల్లవారెను. మంత్రి తనకార్యస్థానమును చేరెను. కాలము గడచిపోవుచుండుటచేతను, రాకుమారి కోరినగడువు నాల్గుదినములు మాత్రమే యుండుటచేతను, మంత్రి పట్టాభిషిక్తుండై రాకుమారిని పెండ్లాడి సుఖించుటకుఁ దగిన సన్నాహము లాచరించునట్లు సేనాపతి కాజ్ఞాపింపవలయునని నిశ్చయించుకొనెను. రమేశదత్తు నగరమున లేక పోవుటచే నాతఁడు తనయభిలాషను దత్తు తిరిగి వచ్చులోపలనే దీర్చి కొనినఁగాని తన వివాహము జయప్రదముగ నెరవేరదని యాతడు భావించెను.

సేనాపతి యెప్పటికిని కార్యస్థానమునకు రాకుండుటచే మంత్రి యాలోచనానిమగ్నుఁ డయ్యెను. అతఁడేమయి యుండునాయని మంత్రికి సందేహము దోపసాగెను. ఒకసేవకుని నాతనిజాడ లరసిరాఁ బంపెను.

'మిత్రులారా! ఎల్లుట శుభదినము. ఆదినముననే కల్యాణోత్సవము, పట్టాభిషేకమహోత్సవముగూడ జరుగవలెను. ఫాలాక్షు డడ్డు వచ్చినను యిందులకు వ్యతిరేకము జరుగరాదు' అని వచించెను. అట నున్న సభికులందరు నందుల కంగీకరించిరి. సభయంతయు మంత్రిగారిపేర విజయధ్వానములతో నిండిపోయెను అందరును కత్తులబూని మంత్రి కభివాదము లొనరించిరి. మంత్రికూడ సంతుష్టాంతరంగుఁడై యీశుభవర్తమానము రాకుమారి కెరింగింపవలసిన దని యొకభటునిఁ బంపెను. ఆహా! యానాడు మంత్రి పొందుచున్న యానంద మేనాడును ననుభవించి యుండలేదు.

ఇంతలో నొక సేవకుఁ డరుదెంచి 'ప్రభూ! రమేశదత్తు నిన్ననే తిరుగ నగరముచేరుకొనెను' అని విన్నవించెను.

'ఎవరు చెప్పిరి?'

'తల్లియే చెప్పినది.'

'ఆగృహమున నెవ రెవ రుండిరి?'

'ఆతనిజననిమాత్రమే కాన్పించెను.'

'మంచిది. ఇక నాతని నుపేక్షింపరాదు. సర్దార్! నీవు పదిమంది భటులతో నరిగి రమేశదత్తును, నాతనిజననిని బంధించి కారాగృహంబున నుంచుము.'

సర్దారు లేచి వినయమున నాతని కభివాద మొనరించి యాసభ వదలెను. మంత్రి యించుకసేపు దీర్ఘాలోచన మొనరించి తల పంకించుచు 'మిత్రులారా! రమేశదత్తు మనకుఁ బ్రాణశత్రువు. ఆతని నిదివరలో చిన్నవయస్కుఁడనియు, క్రమముగ నాతఁడు మనపక్షమునకు రాగలడని యు తలంచి యుపేక్షించితిని. కాని, యిక నాతని నుపేక్షింపరాదు. మీకందఱకు నిదే సంపూర్ణాధికార మొసంగితిని. రమేశద త్తెప్పు డెవ రికి కాన్పించినను నాయాజ్ఞకొఱకు నిరీక్షింపకుండనే యాతనిని ఖండింపు డు.' అని ఘోరముగ నాజ్ఞాపించెను. సభ మరల జయధ్వానములతో నిండిపోయెను.

'సేనాపతికొఱ కరిగిన భటు డింకను రాలేదా?'

ఒకభటుడు ద్వారముకడ కరిగెను. భటుఁడు తిరిగి వచ్చుచుం డెను. ఆతఁ డచిరకాలములో గార్యస్థానము చేరెను. ఆతనిముఖము భీతి తాండవమాడుచుండెను. శరీర మాపాదమస్తకమును వడంగిక పోసాఁగెను. ఆతని చేతులం దొకయుత్తర మున్నది. ఆతఁ డమాత్యున కభివాద మొనర్చి యేమియో చెప్పఁబోయెను గాని, నోట మాట రా

లేదు. అతని భయమును చూచి మంత్రి త త్తరముతో ‘ఏమిరా? ఏమి జరిగినది’ అని ప్రశ్నించెను.

‘ప్రభూ! చెప్పుటకు భయ మగుచున్నది సేనాపతిగృహాము తాళము వేయఁబడి యున్నది. ఆతాళమున కీయుత్తరము కట్టబడి యున్నది. ఆప్రక్కనున్న గోడపై పెద్దయక్షరములతో ‘మంత్రిమరణము నకును, ప్రభువర్యుని దర్శనమునకును నిరీక్షింపుము.’ అని వ్రాయబడి యున్నది. దాని క్రింద ‘కొరడారాణి’ యను రక్తాక్షరములు లిఖింపఁ బడి యుండెను. ఆచీటి తీసికొనివచ్చుచుండ దారిలో నున్నయశ్వరక్షకుఁడు నన్ను బిలచి యొకయుత్తర మొసంగి తమ కిమ్మనియె.’ అని పలుకుచు నాతఁడు రెండుత్తరములను మంత్రిముందు గలబల్లపై నుంచెను ఆయుత్తరములుబల్లపై నుంచునప్పుడుకూడ నాభటునిచేతులు వడంకుచునే యుండెను

మంత్రి త త్తరముతో నాయుత్తరముల దీసి యిట్లు చదువ నారంభించెను.

మొ ద టి యు త్త ర ము.

అ మా త్య శే ఖ రా!

మాప్రయత్నమున నిప్పటికి సంపూర్ణవిజయము గాంచితిమి. సంగ్రామ రంగమున నపరభీష్మునివలెపరాక్రమ విజృంభణమాచరించి, యనేకశత్రు రాజులం బరిమార్చిన భుజబలపరాక్రమసంపన్నుఁడగు సైన్యాధిపతి యిప్పుడు సతీసుతులతోఁగూడ నాయధీనమయ్యెను. అచిరకాలములో నీవుగూడ నగ్నిసాక్షిగ పెండ్లాడిన భార్య నన్యాయము గావించినఫలము, ఇప్పటి కిరువదివత్సరములనుండి నిన్నే నమ్మి దైవముగ భావించుచున్న కనకవల్లి నడవులపా లొనరించినఫలము, రాజద్రోహివై నరేంద్రుని బంధించి యాతనిరాజ్యము నక్రమముగ నాక్రమింప నెంచినయన్యాయ ఫలము నచిరకాలములో ననుభవింపగలవు. నీయుష్ణరక్తధారలే నీచే

నిరసింపబడిన నీసతికిహృదయశాంతి గలిగించునుగాక—నీ వీసాయంకా
లములో రాజేంద్రుని దోడ్కొనివచ్చి మాయనీన మొనరింపనిచో నీకు
మృత్యువుతప్ప దని యెరుంగుము.

ఇట్లు
నీ మరణకాంక్షి,
కొరడా రాణి.

రెండవ యుత్తరము.

అశ్వపాలకా!

ఆకస్మికముగ నా కవసరము వచ్చుటచే నీయాజ్ఞబడయ
కయే నీశాలయందలి రెండుగుఱ్ఱములను గైకొంటిని. వాని నిప్పుడు
మరల నీకడ కంపుచున్నాను. ఆగుఱ్ఱములు సాయుపయోగముననున్న
మూడుగంటలకాలమునకు వాని నియమితమయిన బాడుగ నిందుతో
పంపుచున్నాను. ఇందు ప్రభువునకు రావలసిన సగభాగమును ప్రభువు
ప్రస్తుతము లేనందున నాతనిస్థానమున రాజకార్యముల నిర్వహించు
చున్న యమాత్యశేఖరుల కొసంగి వారివలన రశీదు బడయువలెను.
ఆరశీదు నవకాశమునుబట్టి నేను స్వయముగ వచ్చి గైకొందును.

ఇట్లు
కొరడా రాణి.

దానివెనుకవైపున మరల నిట్లున్నది.

అమాత్యశేఖరులకు-

ఈయుత్తరమున నుదహరింపఁబడిన బాడుగ పండ్రెండు
రూప్యములు ముట్టినవి. అందు ప్రభువువారికి రావలసిన యారురూ
కలను సాయంకాల మొసంగెదను. ప్రస్తుతము రాజాలకపోయినందులకు
మన్నింతురుగాక.

ఇట్లు
అశ్వపాలకుడు.

'సభికులారా! చూచితిరా యీకౌర్యము! మన మింతవరకును రమేశదత్తునేగాని కొరడారాణిమీద లక్ష్యముంచుటలేదు. స్త్రీ యని నిరసించినందుల కామెప్రలాపము లతీతము లగుచున్నవి. లెండు. నేడే నగర మంతయు శోధించి యామెను బంధింపవలయును. లెండు. మరణమునకైన వెనుదీయక నేడు సఫలీకృతులము గావలయును కొరడా రాణిని బంధించి యామెయుపర క్తులను కనులఁ గాంచిన మరుక్షణముననే మీకందరకును వారణాసీరాజ్యము పంచి యిచ్చెదను. అది యుంగాక రాజ్యాభివృద్ధికై యమితకష్టముల కోర్చి వీరవిహార మొనర్చి రాజ్యరక్షణకు మూలకారకుండయిన సేనాపతిని రక్షించుట మనకు ముఖ్యకర్తవ్యము. లెండు. సహములు గట్టుడు. వీరులకు రాజ్యకాంక్ష ముఖ్యము.' అని పలుకుచు నాతఁడు రోషంబున నాసనము డిగ్గి ఖడ్గహస్తుడై యాకార్యస్థానము వదలెను. సభికులందరును విజయోత్సాహులై యాతనిని వెంబడించిరి.

ధన మెట్టి యవినీతికార్యముల నయిన నాచరింపఁ జేయును గదా! పాప మాసర్దారులందరును దుర్మార్గుఁడగు మంత్రివచనముల నమ్మి కొరడారాణిపై కత్తి గట్టనెంచిరి. వారి కీప్రయత్నమున విజయము చేకూరునా? ఏమో! ఎట్లు చెప్పగలము? జయాపజయములు దైవాధీనములు గదా!

మంత్రి కార్యస్థానము వదలి, తిన్నగ నశ్వశాలకడ కరుదెంచెను అశ్వపాలకుఁ డాతనిరాక గాంచి యెదురేగి వినయంబున నభివాద మొనంగి గౌరవించెను. శాలలోనికి దోడ్తెచ్చి యొక్కయాసనముపై కూర్చుండజేసెను.

'ప్రభూ గుర్రములను కడిగించుట, శాల శుభ్రము చేయించుట మున్నగు కార్యములవలన నీపూట రాజాలక పోయితిని. మన్నింతురుగాక! ఇదిగో పైకము. రసీ దొసంగుడు.' అని పలుకుచు నాయశ్వ

రక్షకుడు మొలనున్న రూప్యముల నమాత్యున కొసంగఁబోయెను. మం
త్రి యారూకలు గైకొనకయే 'ఓయీ! నీకీరూకలను యుత్తరమును
యెవ్వరిచ్చిరి?' యని ప్రశ్నించెను.

'ప్రభూ! యెవ్వరును యొసంగలేదు. రూక లాయుత్తరముతో
సహా నొకగుడ్డను మూటగట్టబడి యాయూట నాగుర్రములలో నొక
దాని మెడకుం గట్టబడెను. గుర్రము లెవ్వరును వెంటలేకుండగనే తిరిగి
వచ్చినవి.'

ఆగుర్రములకు భాషాజ్ఞానము గలదా?'

ఆరెండుగుర్రములునుకూడ రాకుమారిచే నొసంగబడినవి.ఆమె
సౌధముపైనుండి యీల వైచినచో నయ్యవి త్రాళ్ళను తెంపుకొని
యాచోటఁ జేరుకొనును. చిన్నతనమునుండియు నాగుర్రము లామెచే
నట్లు తయారు గావింపబడినవి.'

'అయిన నాగుర్రములను రాకుమారియే గైకొని పోయియుం
డునని నీయభిప్రాయమా!'

'కాదు. ఆతఁడొక పురుషుఁడట. నాల్గుగంటల కింటిదగ్గరనుండి
వచ్చుచున్న నాభటుఁడాగుర్రములపై నిరువురుపురుషు లరుగుచుండ
జూచెనట. వానిని చేనే బాదుగ కొసంగియుండునని తలంచి యూర
కొన్నట్లు చెప్పినాడు.'

'ఆగుర్రము లెంతదూరము పయనము గావించియుండునని నీ
యూహ.

'రాను పోను కలసి పదిమైళ్ళకంటె నెక్కువ యుండదు. గుర్ర
ము లించుకంతయైన నలసియున్నట్లు గన్పట్టుట లేదు అంతకన్న నిజము
గ నెక్కువదూరము పయనము గావించినచో నాయశ్వారోహులు క
డునేర్పరులని చెప్పక తప్పదు.'

'రాకుమారి కీవార్త నెరింగించితివా?'

'లేదు. భోజనానంతరము స్వయముగ బోయి తెలుపవచ్చు నని యూరకొంటిని.'

మంత్రి యిక నేమియు మాటాడ జాలక పోయెను. ఆతని హృదయమున రాకుమారియే యాతురగముల రాత్రి యుపయోగించు కొనియుండునని యనుమానము తోచెను. కాని యుత్తరమున గౌరడా రాణి యని వ్రాయబడియుండెను. ఆతని కేమి పల్కుటకును తోచ లేదు. తొలుత నే యుపశకునము వాటిల్లుటచే నాతఁ డానాటికి దనప్రయత్నమునుండి విరమింపఁ దలంచెను.

'అశ్వపాలకా! రూకలనిచ్చి నీభటుని నావెంట గార్యస్థానమున కంపుము. అచట రసీ దొసంగెదను. ఇంతటినుండి నాయనుమతిఁ బడయక నీ వెవ్వరికిని గుఱ్ఱముల నద్దె కొసంగరాదు.' అని పలుకుచు నా తడు కూర్చున్న యాసనమునుండి లేచెను. అశ్వపాలకుఁడు చిత్తమని మాత్రము పలికి యూరకుండెను. మంత్రి వెడలి పోయినతోడనే యా యశ్వపాలకుఁడు తనభటున కారూకల నొసంగి రశీదు తెమ్మని చెప్పి మంత్రి వెంట బంపెను.

మంత్రి కార్యస్థానమును చేరి యాభటునకు రసీదు వ్రాసియిచ్చి రాకుమారితో ముచ్చటించు నుద్దేశమున నాకార్యస్థానము వదలెను.



# పదునైదవ ప్రకరణము.



మృణాళి తనయంతిపురంబున శయ్యాతలంబున మేనువాల్చి యే దియో దీర్ఘాలోచన మొనరించుచుండెను. ఆమె జనకు నెప్పుడుగాంతు నా యనియు, తాను మంత్రి నడిగిన గడువుకాలము సమీపించుటచే మంత్రి త న్నెట్టి నిర్బంధములకు లోను గావించునో యనియు నాలో చింప దొడంగెను. అబలయగుట నామె యేమియుఁ జేయఁజాలక పో యెను. భగవానునిపై భారము వైచి యామె జరుగబోవుకార్యక్రమం బును నిరీక్షించుచుండెను.

మంత్రి యొక్క యాకస్మికాగమన మామెయాలోచనల కంత రాయము గల్గించినది. మంత్రిని గాంచుటతోడనే యామె మందస్మిత వదనారవిందయై 'అమాత్యశేఖరులకు స్వాగతము' అని పలుకుచు శ య్యపై నుండి లేచి యెదుటనున్న యాసనమును చూపెను. మంత్రియు నాయాసనముపై గూర్చుండి 'రాకుమారీ! గతరాత్రి నీవెచ్చట కయిన నరిగితివా?' యనెను.

'లేదు. రాత్రియంతయు జ్వరపీడితనై యుంటిని. ఇంతవరకును స్వస్థత లేదు. భవద్దర్శనముచే నించుక యుత్సాహము జనించినది.'

'రాత్రి నీగుఱ్ఱము లెవ్వరో గైకొనిపోయి రట. నీయశ్వము లె వరియాజ్ఞనైన నీయాజ్ఞవలెఁ భావించునా?'

'ఒక్క సేనాపతిదక్క యితరులు నాయశ్వముల స్పృశింప నైన లేరు.'

'ఔరా! యెంతఘోరము! సేనాపతియే కొరడారాణి యనుపేర రాజ్యమున నల్లకల్లోలము గావించుచున్నాడు.'

ఆమాట లామె కాశ్చర్యము కలిగించినది. 'ఏమి! మనసేనాపతియా? ఏమి జరిగినది? సవిస్తరముగ నెరింగింపుము.'

మంత్రి యామెకుఁ గతరాత్రి జరిగిన దంతయు నెరింగించెను ఒక్కొక్క యక్షరము రాకుమారిముఖమున కొక్కొక్క వింతమార్పును సంఘటిల్లఁ జేయుచుండెను. చివర నాకొరడారాణిచే వ్రాయబడిన రెండుత్తరములుగూడ చదివెను. రాకుమారి యంతయు నాలకించి భీతావహయై, 'అమాత్యశేఖరా! నాకేమియుం దోచుటలేదు. నేను నీ యాజ్ఞాబద్ధురాలను. నాజనకునిమాత్రిము నాకుఁ జూపుము. నే నీజన్మమున నభిలషించునది నాపితృదర్శనమే! అని రాకుమారి కన్నుల నీరుపెట్టెను.

'రాకుమారీ దుఃఖపకుము నాయాశయ మీడేరిన మరుచటి దినముననే నీయాశయము దీర్పగలను.' అనివాగ్దానము గావించి 'రాకుమారీ, నీయశ్వము లఁ దెప్పించి మనప్రాకారమున గట్టించెదను.' అని పల్కి వెడలిపోయెను.

'రాకుమారితో సంభాషించినప్పటినుండియు మంత్రికి సేనాపతియే కొరడారాణి యనునామంబునఁ బ్రవర్తించుచున్నాఁ డనుయనుమానము వృద్ధిగాఁ జొచ్చెను. ఆతఁ డాయాలోచనతోనే కార్యస్థానమునఁ జేరెను. అప్పుడే రమేశదత్తుం బంధింప నరిగినసరదారు కార్యస్థానమునఁ దనకొఱకు వేచియుండుట గాంచి 'ఓయీ! నీవరిగిన పని సఫల మయినదా?అనెను

'సగముపరకుమాత్రమేఅయినది. దత్తు యింట లేడు నగరమంతయు వెదికితినిగాని యెందును వానిజాడ గాన్పింపలేదు. ఆతని తల్లినిమాత్రము బంధించి కారాగృహమున నుంచితిని.'

'ఏమి లాభము! దుర్మార్గుడు— పరిక్కలో బల్లెము— వానిని బంధింప గల్గినప్పుడే మనకు శ్రేయస్సు.'

'అమాత్యశేఖరా! తొందరపడకుడు. తలంచినంతనే కార్యము లగునా? రెండు మూడుదినములలో రమేశదత్తునుగూడ బంధించి మీ యధీన మొనర్చెదను.

'నీవట్టివాడవని యెఱింగి యుండుటచేతనే యీదుర్భరకార్య భారమును నీపై నుంచితిమి.'

'ప్రభూ! నాప్రతిన వినుఁడు రేపటిదినమున నే నాతని బంధింపనైన బంధింపవలయును. అదియే నామనో నిశ్చయము.'

సెబాసు! ఇదిగో ముందీబహుమానము గైకొనుము 'అని పలుకుచు మంత్రి యొక్కయమూల్యహారము నొసంగెను. ఆసర దారానందముతో నాహారము గైకొని వెడలిపోయెను.

---

# పదునాఱవ ప్రకరణము.

పాఠకులారా! వారణాసీ నగరమంతయు నేఁడానందమయమై యున్నది. పచ్చని పందిళ్ళతోడను మేళతాళములు మొదలగు వాయిద్యవిశేషములతోడను చాలసంతోషముగ నున్నది. ఎవరినోట విన్నను అమాత్యుల కల్యాణమను యక్కరములు వెలువడుచుండెను.

'ఏమి? మంత్రివివాహమా! వధూటి యెవ్వరు? రాకుమారియేనా? అక్కటా! ఆసుందరాంగి విద్యావినయసంపన్న యాకర్కశహృదయుని బెండ్లాడ నంగీకరించెనా? ఆహా! భగవానుని మాయలద్భుతములు గదా!'

మంత్రి మకులాంబరముల ధరించి వివాహసమయమున కెదురు
చూచుచుండెను. అతని యుత్సాహముతోబాటు యాతని గర్భశత్రు
వులగు రమేశదత్తు కొరడారాణియు, నింతవర కాతని చేఁ జిక్కనందున
నాతనికి భయవిచారములుగూడ గల్గించుచుండెను. మంత్రిసౌధమునఁ
గల యందరును యుత్సాహముతో మంత్రివివాహకాలమున బహుమానము
లందవలయునని యాతురపడుచుండిరి.

రాకుమారికూడ పూర్ణముగ నలంకరించుకొనుచుండెను. ఆమె
చెలుల నెవ్వరిని రానిచ్చుటలేదు. తానే స్వయముగ నలంకరించుకొను
చుండెను. ఆమె హృదయమున విచారమున్నట్లు గాన్పించుట లేదు.
సంపూర్ణానురాగబద్ధయై యామె మంత్రిని మనఃపూర్వకముగ ప్రేమించి
వివాహమాడ సిద్ధపడుచుండెను ఏమి యీవింత? రాకుమారి యా
దుర్మార్గు నెట్లు పెండ్లాడ నంగీకరించుచుండెను? ఏమో! ఆతనియందు
రాకుమారి నాకర్షింపగల సుహస్తరశక్తి యేమున్నదో మనకెట్లు తెలి
యును? ఆయన్యోన్యానురాగబద్ధులగు దంపతుల వివాహమహోత్సవ
మును మనముగూడ కన్నులారగాంచి యానందింతము.

వివాహవేదికకడ రాకుమారియు మంత్రియు యెదురెదురుగ
గూరుచుండిరి. సరిగ నాసమయమున నొకభటు డరుదెంచి 'ప్రభూ!
సరదారు రమేశదత్తుచే సంహరింపబడెను.' అనెను. మంత్రి యదరిపడె
ను. ఏమి? సంతోషముగ పెండ్లాడు సమయమున మృత్యువార్తాశ్రవ
ణమా! మంగళకరగీతామధ్యమున నమంగళ వాక్యములా!

ఆకస్మికముగ ద్వారముకడ భయంకరసంగ్రామము జరుగుచు
డెను. ఇరువురు వీరపురుషులు వీరవిహార మొనర్చుచు తనసైనికు
చించి చెండాడుచుండిరి. ఆభీకరదృశ్యము చూచి మంత్రి యాశ్చర్య
మందెను. కత్తి తీసి యావీరునిపైకి విసరబోవునంత వెనుకనుండి యొక
కొరడాతో నాఖడ్గహస్తము నదలించి యాఖడ్గమును క్రిందపార వేయి

చెను. మంత్రి యాశ్చర్యముతో వెనుదిరిగి చూచెను. పెద్దకొరడా చేతఁబూని రాకుమారి భయంకరవదనయై ప్రత్యక్ష మయ్యెను. మంత్రి యామెనుఁ గాంచి 'కొరడా—' యనెను. రాకుమారి 'రాణి' యని పూర్తిగావించెను.

ఇంతలో రాజేంద్రునితో నరుదెంచిన రమేశదత్తు గ్రుడ్డై 'ఓరీ రాజద్రోహీ! నీపాపము లన్నిటికి ఫలితము భయంకరమృత్యువు.' అని పలుకుచు నాతనిఖడ్గముతో మంత్రి నొక్కపోటు పొడిచెను. ఆపోటుతో నాతఁడు భూమిపై కొరిగెను.

ఆకస్మికముగ నొకయున్మాదిని యరుదెంచి మంత్రికళేబరముపై బడి 'హా! దైవమా! ఇందులకా నన్ను జీవింపజేసితివి.' అని బిట్టుగ నేడ్వసాగెను. అందరాశ్చర్య మందిరి. ఆయున్మాదిని యెవ్వరు? రమేశదత్తు జనని—ఇరువది వత్సరముల క్రిందట నమాత్యునిచే నిరసింపఁబడిన యాతని యర్ధాంగి.

ఏమీ! రమేశదత్తు సచివనందనుఁడా ఆశ్చర్యము.

♦ ♦ ♦ ♦ ♦ ♦

మృణాళీ రమేశదత్తుల వివాహ మతిజయప్రదముగ జరుపఁబడెను. వృద్ధరాజు రమేశదత్తును సింహాసనాసీనునిం గావించి 'వత్సా! నీపౌరుషపరాక్రమంబులకు రాజభక్తికిని మెచ్చితిని. మదీయపుత్రిఁ గూడి సుఖించుచు ధర్మబద్ధంబుగ ధరాపాలన మాచరింపుము.' అ యాశీర్వదించెను.

అందరానందించిరి.

సంపూర్ణము.



# ఖబర్దార్.

గ్రంథకర్త:— ఎ. వి. రావుగారు.

ఈ నవల పేరు విన్నంతనే మీరు మీజేబులలోని పర్సులను, యిండ్లలోని ధనరాసులను, సౌందర్య వతులైన యువతులను, ఆస్తులను కాదుముకొందురా యేమి? తల్లడ మందుదురా? తొట్రుపాటుపడుదురా? అంతే! పడవలసిందే! కాని, యీ నవలలోని అపరాధపరిశోధ కాగ్రగణ్యుడగు మధుసూదనుని చూచితిరా! మీగుండెలు నిబ్బరమగును. ఇందు సుందరలాలుహత్య, వెంబడినే మోహనదాసుహత్య- యెంత చిత్రముగా జరిగినవో - యితర పత్తేదారులు, గొప్ప పోలీసుద్యోగులు హంతకులచే బంధింపబడిరే కాని, మధుసూదనుఁడేల బంధింప బడలేదో! ధనవంతుల, యిండ్లలోనున్న నౌకర్లు, ఆడవాళ్లు సహిత మెంతెంత దారుణాల కొడిగడతారో! రామారా వెంత సాహసికుఁడో, మాధవుఁ డెంత స్వామిద్రోహియో! సుందరులా లెంత ధనవంతుఁడో! ఆతని వ్యాపార మెంతగొప్పదో, తెలిసికో? ఇందులోని సుశీల నడతవంటి చదువుకున్న ఆడవాళ్ళంతా వ్యభిచారిణు లౌతారని వాదించెవా రంతా తల వంచుకొంటారు. వ్యాపారులు చదివితే వ్యాపార మార్గాలు తెలుస్తాయి. నౌకర్ల నియామకంలో ధనవంతులు జాగ్రత్తపడ తారు, కాని 'ఖబర్దార్' అని పేరుచూచి భయపడకు జంకకు, గొంకకు. అద్భుత దృశ్యాలు. - శ్రవణమాత్రంచే తృప్తితీరదు. నీకన్నులతో చూచి, నీ నోటితో చదివి తెలుసుకో.

కావలసినచో:— వెల రూ. 1—0—0

**కర్రా అచ్చయ్య అండ్ సన్స్,**

ఈశ్వర బుక్ డిపో,

**రాజమండ్రి.**

లైటిల్ పేజీమాత్రమే ఇంపీరియల్ ప్రెస్‌నందు ముద్రింపఁబడియె, రాజమండ్రి.